Licenced to Post without Prepayment (AP/VJ-16/WPP/2012-13)
స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి
Longest Living Newspaper in Telugu Journalism

# జమీన్‌రైతు

సంపుటి: 83 • సంచిక: 19 • 10-5-2013 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



# రాష్ట్ర కాంగ్రెస్‌లో అసమ్మతి రాగాలు!

ఆరోగ్య మంత్రి డిఎల్ రవీంద్రరెడ్డి చాలా సీనియర్ రాజకీయ వేత్త. 1978 నుంచి రాష్ట్ర రాజకీయాలలో కీలక పాత్ర పోషిస్తున్నాడు. వైఎస్ రాజశేఖర్‌రెడ్డితో కలిసి ఒకేసారి రాజకీయ ఆరంగేట్రం చేసిన వాడు. కానీ కాలం కలిసిరాక వెనుకబడి పోయాడు. కిరణ్‌కుమార్‌రెడ్డి మంత్రి వర్గంలో పని చేయడం ఆయనకు ముళ్ల మీద కూర్చొన్నట్లు వుంది. అయితే చేయగలిగింది ఏమీ లేదు. అయినా ఊరకుండలేదు కదా? ఎప్పటి కప్పుడు ముఖ్యమంత్రి కుర్చీ క్రింద పొగ పెట్టడానికి ఏదో ఒక ప్రయత్నం చేస్తూనే వుంటాడు. కొన్ని రోజులు జెసి దివాకర్‌రెడ్డిని ఎగదోశాడు. ఫలించ లేదు. శంకరరావుకు ప్రాంప్టింగ్ చేశాడు. దాని వల్ల రచ్చ రేగింది కానీ ఫలితం దక్కలేదు. ఇప్పుడు తాజాగా పిసిసి అధ్యక్షుడు సత్తిబాబును గిల్లుతున్నాడు.

బొత్సాకు ఢిల్లీ సంబంధాలు జాస్తి. ఆజాద్, అహ్మద్‌పటేల్ వంటి వారితో స్నేహం వుంది. ఇక్కడ ఎంత గోల చేసినా కిరణ్ దుంప తెగడం లేదు కాబట్టి ఢిల్లీ నుంచి నరుక్కొని రావాలంటే బొత్సాను ముగ్గులోకి దింపాలని ఆలోచన చేశాడు డిఎల్ రవీంద్రరెడ్డి. బొత్సాకు కూడా కిరణ్ మీద గొంతు వరకు కసి వుంది. పిసిసి అధ్యక్షుడిగా ప్రాభవంలోకి వస్తున్న సమయంలో మద్యం బురద క్రుమ్మరించి తనను భ్రష్టు పట్టించాడన్న ఆక్రోశం వుంది. సరైన తోడు లేకుండా ఏమీ చేయలేరు కాబట్టి ఇంతకాలం ఉగ్గపట్టాడు. ఇప్పుడు డిఎల్ రవీంద్రరెడ్డి మంత్రాంగం అండగా దక్కడంతో ఎక్కడలేని ఉత్సాహం తెచ్చుకొని పని చేస్తున్నాడు. ఆయనకు ఆనం రామనారాయణరెడ్డి, వట్టి వసంతకుమార్ జత కలిశారు. ఈ గుంపు మొత్తం చిరంజీవి ఇంట్లో వాలి పోయింది. కేంద్రంలో చిరంజీవికి ఎంతో కొంత ప్రాధాన్యత ఉంది ఇప్పుడు. రాష్ట్రం మొత్తం తిరిగి ఎన్నికల ప్రచారం చేయగలిగిన నేత అంటూ పార్టీలో ఎవరూ లేరు కాబట్టి, ఆ పుణ్యం చిరంజీవి కట్టుకొంటాడన్న ఆశతో వుంది కేంద్ర నాయకత్వం. 2009 ఎన్నికలలో ఆయన ఎంత తిరిగినా జనం పట్టించుకోలేదన్న విషయం మర్చి పోయింది. సినీ నటుడు కాబట్టి సభలకు జనం వస్తారు, అంతే చాలు అనుకొంటున్నారు వారు. ఢిల్లీ అధిష్టాన దేవత చెవిలో తాము మోసే చాడీలను చిరంజీవి అయితేనే బాగా వినిపింపచేస్తాడని బొత్సా బృందం ఆశ. చిరంజీవికి కూడా కిరణ్ మీద గుర్రు వుంది. 1978, 1989

కొరవ 14వ పేజీలో

## • కర్నాటకలో గెలుపుతో

# కాంగ్రెస్‌కు ఉపశమనం!

ఎన్నికలలో గెలిచామా లేదా అన్నదే ముఖ్యం. ఎట్లా గెలిచాము, ఎవరి వల్ల గెలిచాం, అది గెలుపా వాపా అన్న ప్రశ్నలు వ్యర్థం. కర్నాటక శాసనసభకు జరిగిన ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీ గెలిచింది. 223 స్థానాలున్న సభలో 122 మంది కాంగ్రెస్ ఎమ్మెల్యేలు వుంటారు. అంటే ప్రభుత్వ ఏర్పాటుకు పూర్తి బలం అన్నమాట. మరొకరి సహకారం అవసరం లేదు. ఉత్తరప్రదేశ్, బీహార్, గుజరాత్, పంజాబ్, పశ్చిమబెంగాల్ ఇట్లా వరసబెట్టి జరిగిన ప్రతి ఎన్నికలోనూ ఓడిపోయి, నీరసపడి వున్న కాంగ్రెస్ పార్టీకి జాతీయ స్థాయిలో పెద్ద ఉపశమనం ఈ గెలుపు. పార్లమెంట్ ఎన్నికలు ఏ క్షణంలో నైనా ముంచుక రావచ్చుననే వదంతులున్న నేపథ్యంలో ప్రజల ముందుకు వెళ్లడానికి ఎంతో కొంత నైతిక స్థైర్యం సమకూరుతుంది సోనియా గాంధీకి.

బిజెపికి ఇది చాలా పెద్ద దెబ్బ. దేశ చరిత్రలోనే అత్యంత అవినీతివంతమైన ప్రభుత్వంగా మన్మోహన్‌సింగ్ సర్కారు పేరు పడడంతో దేశ ప్రజలంతా కాంగ్రెస్‌ను ఛీత్కరిస్తారని, తమను పిలిచి పట్టం కడతారని ప్రచారం చేసుకొంటున్నారు వారు. కానీ కర్ణాటక ప్రజలు ఢిల్లీ అవినీతి కంటే బెంగుళూరు అవినీతికి ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చారు. దక్షిణాది రాష్ట్రాలలో బిజెపి అధికారంలోకి రావడం ఒక్క కర్ణాటకలోనే సాధ్యమైంది. ఆ ఘనత యడ్యూరప్పది. ఒంటి చేత్తో బిజెపికి ఆ ఘనత కట్టబెట్టాడు.

కొరవ 14వ పేజీలో

## ఈ మసి చెరపలేనిది

బొగ్గు కుంభకోణంలో కేంద్ర ప్రభుత్వానికి నడి వీధిలో బట్టలూడదీసింది సుప్రీంకోర్టు. లక్ష కోట్ల రూపాయల పైన అవినీతి జరిగిందని కంట్రోలర్ అండ్ ఆడిటర్ జనరల్ ఇచ్చిన నివేదిక ఆధారంగా సిబిఐ చేపట్టిన దర్యాప్తును నిర్వీర్యం చేయడానికి కేంద్ర న్యాయశాఖ మంత్రి అశ్వనికుమార్, ప్రధానమంత్రి కార్యాలయంలోని అధికారులు, అటార్నీ జనరల్ వాహనవతి తదితరులు జరిపిన కుత్సితప్రయత్నాన్ని తీవ్రంగా గర్హించింది సుప్రీంకోర్టు. సిబిఐని పంజరంలో చిలుక వలె చెరపట్టి ఆడిస్తున్నారని తిట్టిపోసింది. సుప్రీంకోర్టు ఇంత తీవ్రస్థాయిలో అభిశంసించిన తర్వాత కూడా కేంద్రంలోని యుపిఏ ప్రభుత్వం నిస్సిగ్గుగా, నిర్లజ్జగా అధికారాన్ని అంటి పెట్టుకోవడం హీనమైన విషయం.

ప్రధానిగా మన్మోహన్‌సింగ్ పదవి చేపట్టిన తొలి దినాలలోనే బొగ్గు గనుల పందారం మొదలైంది. ఆ శాఖకు ఆయనే మంత్రిగా కూడా వ్యవహరించడం ఇక్కడ గమనార్హం. దేశంలో తీవ్రమైన విద్యుత్ కొరత వుంది కాబట్టి, చాలినంత విద్యుత్ లేకుండా పరిశ్రమల ప్రగతి సాధ్యం కాదు కాబట్టి, విద్యుత్ ప్రాజెక్ట్ పెడతామని ముందుకు వచ్చే వారందరికీ గనులు కేటాయించాలన్న నిర్ణయం తీసుకొన్నాడు ప్రధాని. అయితే ఆ పందారం, విద్యుత్ అవసరాలు, దేశ ప్రయోజనాల కోసంగా కాకుండా, ప్రజల సొత్తైన సహజ సంపదను కొందరు ఆషాఢభూతులకు పంచి పెట్టడంగా జరిగింది. ఇంత భారీ స్థాయిలో సహజ వనరులను ప్రైవేటు పరం చేయతలపెట్టినపుడు బహిరంగ వేలం ప్రక్రియ పాటిస్తే కొంతలో కొంత వాస్తవిక విలువ దక్కుతుంది. కానీ ప్రధాని, దరఖాస్తు చేసుకొన్న వారికి నేరుగా కేటాయింపు జరిపించేశాడు. ఆ ప్రక్రియలో అసలు విద్యుత్ ప్రాజెక్ట్ ఆలోచన కూడా లేని వ్యాపారులు రాజకీయ పలుకుబడితో దొంగ కాగితాలు సంపాదించి గనులు కొట్టేశారు. కేటాయింపు జరిగి పదేళ్ళు దాటి పోతున్నా 2004లో కేటాయించిన గనులలో 10 శాతం కూడా బొగ్గు తవ్వకం జరపడం లేదంటే కేంద్రం చేసిన తప్పు ఏమిటో అర్థం చేసుకోవచ్చు. ప్రభుత్వ విధానాన్ని తమకు అనుకూలంగా అన్వయించుకొని లక్షల కోట్ల రూపాయల విలువ చేసే గనులను స్వంతం చేసుకోవడం తప్ప ఈ దరఖాస్తుదారులలో 90శాతం మందికి విద్యుత్ ప్రాజెక్టులు పెట్టే తలంపే లేదు. ఈ దుర్మార్గాన్ని సిఏజి వెలికి తీసింది. మొదట ప్రధానమంత్రి ఆ నివేదికను తేలికగా కొట్టి పారేశాడు. దానిపై బిజెపి పార్లమెంటరీ పార్టీ కేంద్ర విజిలెన్స్ కమిషన్‌కు ఫిర్యాదు చేసింది. వారు ప్రాథమిక విచారణ జరిపి, గనుల దోపిడీ జరిగిందని నిర్ధారించుకొని సమగ్ర దర్యాప్తు కోసం సిబిఐని రంగంలోకి దింపారు. అయితే ప్రధాని ఆయన మంత్రివర్గ సహచరులు కలిసి సిబిఐకి అడుగడుగునా అడ్డం తగిలారు. దానితో ఈ విషయం సుప్రీంకోర్టు దృష్టికి వెళ్లింది. కోర్టు ఆదేశంతో దర్యాప్తు మొదలు పెట్టిన సిబిఐపై మళ్లీ అధికార ఒత్తిడి ప్రయోగించారు. దర్యాప్తులో కీలక అంశాలను వెలికి తీసిన ఒక అధికారిని బదిలీ చేశారు. వారు తయారు చేసిన నివేదికను న్యాయమంత్రి, బొగ్గు శాఖ అధికారులు, ప్రధాని కార్యాలయ అధికారులు కలిసి మార్పులు చేశారు. ప్రధాని పేరు ప్రస్తావనకు రాకుండా జాగ్రత్తపడ్డారు. సిబిఐ డైరెక్టర్ రంజిత్ గుప్త ఈ అంశాన్ని చాలా తెలివిగా సుప్రీంకోర్టు దృష్టికి తెచ్చాడు. దానితో మొత్తం భాగోతం వెలికి వచ్చింది.

ప్రధాని మీద దేశ ప్రజలకు చాలా గౌరవం వుంది. ఆయన నీతి, నిబద్ధతల మీద నమ్మకం వుంది. కానీ తన పదవి కాపాడుకోవడం కోసం ఆయన పదే పదే తప్పులు చేస్తూనే వున్నాడు. 2జి కుంభకోణం ఆయనకు తెలిసే జరిగింది. కానీ సంకీర్ణ ధర్మం అనే నెపంతో తప్పించుకొన్నాడు. ఇపుడు బొగ్గు దగాలో తన పేరు ప్రత్యక్షంగా చిక్కుకపోతుందని తెలియడంతో సిబిఐ దర్యాప్తును ప్రక్కదారి పట్టించడానికి ప్రయత్నం చేశాడు. ఇంత జరిగిన తర్వాత ఆయన నీతి, ఆయన నిజాయితీ, ఆయన నిబద్ధత ఏమి చేసుకోను? వ్యక్తిగతంగా లంచం తినలేదనే ఒక ఒక్కకుంటిసాకుతో ఇన్ని కుంభకోణాలను సహించే ఓర్పు ఈ దేశ ప్రజలకు లేదు. బొగ్గు గోల్మాల్‌లో ఆయనకు అంటుకొన్న మసిమాట లతో చెరపలేనిది. సుప్రీంకోర్టు అంత ఘాటుగా చీవాట్లు పెట్టిన తర్వాత కూడా నాటకాలు ఆడడం మాని, తక్షణం పదవికి రాజీనామా చేసి, చట్టం ముందు తన నిర్దోషిత్వాన్ని రుజువు చేసుకోవడం మన్మోహన్‌సింగ్ పాటించవలసిన కనీస ధర్మం. సంకీర్ణ ధర్మం కంటే ముఖ్యమైనది అది.

## జనవాణి

### ఎగుడు దిగుడు పని!

నెల్లూరు నగరంలో ట్రంకురోడ్డు విస్తరణ పనులు వందల కోట్ల రూపాయలు వెచ్చించి చేస్తున్నారు. కానీ ఈ పనుల్లో నాణ్యత లేదు. పనిచూస్తే ఎగుడు దిగుడుగా వుంది. జిల్లా అధికార యంత్రాంగం ఈ వ్యవహారాన్ని పట్టించుకోకుండా ఉదాసీనవైఖరి చూపడం బాధాకరం.

ఎం.సత్యసాయి — నెల్లూరు

### పాపం విద్యార్థులు

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల అపసవ్య విధానాల కారణంగా కార్పొరేట్ సంస్థలు ఇబ్బడిముబ్బడిగా పుట్టుకువచ్చి విద్యను గుప్పెట్లో పెట్టుకొని వ్యాపారం చేస్తున్నాయి. విద్యార్థులలో ర్యాంకులు సాధించడం, ఉద్యోగాలు సంపాదించి ధనార్జనే ధ్యేయమన్న ఆలోచనా ధోరణిని పెంచి పోషిస్తున్నాయి. ప్రతిభ, సృజనాత్మకత, మానసిక, శారీరక వికాసం, మానవతా, సాంస్కృతిక విలువలను విస్మరించడం, మాతృభాషను విడిచిపెట్టి అన్యభాషలలో విద్యాబోధన, దేశభక్తి, సామాజిక బాధ్యతలకు దూరంగా వ్యక్తిత్వ వికాసం చేస్తుండడం వలన విద్యార్థులు సృజనాత్మకతకు దూరంగా, యంత్రాలుగా తయారు చేయబడుతున్నారు.

పి.అరుణకుమారి — నెల్లూరు

### సరకుల సంచితో మోసం!

అమ్మ హస్తం ద్వారా నిత్యావసర వస్తువులను ఒక సంచిలో పెట్టి ఇస్తున్న కిరణ్‌కుమార్‌రెడ్డి ప్రభుత్వం ఆ సంచిపై తమ బొమ్మలు ముద్రించుకొంది. సంచిపై బొమ్మలున్న పెద్దలెవరూ ఈ పథకానికి డబ్బు సమకూర్చడం లేదు. అంతా ప్రజల సొమ్మే. ఈ పథకంలో మరో చిక్కు వుంది. గోధుమపిండి మూడు నెలలో పాడై పోతుంది. సరిగ్గా భద్రపరచకపోతే చింతపండు, కారం, గోధుమలు పాడై పోతాయి. గోడౌన్ల నుంచి అమ్మహస్తం ద్వారా లక్షిత హస్తాలకు ఈ సంచులు చేరే సరికి అందులో ఎన్ని పాడై పోతాయో చెప్పలేని పరిస్థితి.

వి.మాలకొండయ్య — కావలి

### ఎన్నాళ్లీ నిరీక్షణ!

డిఎస్సీ – 1998 ద్వారా రాత పరీక్షల్లో క్వాలిఫై అయ్యి, ఇంటర్వ్యూలలో నెగ్గిన రెండు వేల మంది నిరుద్యోగులు గత 15 ఏళ్లుగా ఉద్యోగాల కోసం ఎదురు చూస్తున్నారు. చంద్రబాబునాయుడు 1998 నుంచి 2004 దాకా 98 డిఎస్సీలో క్వాలిఫై అయిన వారికి పోస్టింగులు ఇస్తామని మోసం చేశారు. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి 2004లో చేసిన పాదయాత్రలో 98 డిఎస్సీలో అన్యాయం జరిగిన వారిని ఆదుకొంటానని మోసం చేశారు. ఇప్పటికైనా కిరణ్‌కుమార్‌రెడ్డి సర్కార్ కోర్టు ఇచ్చిన ఆదేశాలను పాటించి ఉద్యోగాలివ్వమని కోరుతున్నాము.

పి.రవికుమార్ — నెల్లూరు

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

14-5-1943
పేజీలు : 4 వెల: అణా

### నెల్లూరు ముచ్చట్లు

### వి.ఆర్.హైస్కూల్

సుబ్బారావు గారి మరణానంతరం హెడ్‌మాస్టరు ఎవరా అనే ప్రశ్న ఉదయించింది.

ఈ హైస్కూల్ ఈ మధ్య చెడిపోయినా చాలాకాలం మంచి పేరుతో యశస్సును గడించిన సంస్థ. మెరిట్‌ను బట్టి ఉపాధ్యాయుల సెలక్షన్ జరిగినంత వరకు బాగానే ఉండింది. సిఫార్సులు, మొగమాటాలు, తన – మన ఏర్పడ్డ తరువాత బొత్తిగా చెడ్డది. చాలా మంది పిల్లలు ఇతర హైస్కూళ్లకు వెళుతున్నారు గూడా.

కావున కమిటీ వారిని మేము వినయపూర్వకముగా ప్రార్థించేదేమనగా హెడ్‌మాస్టరును సినియారిటీని బట్టిగానీ, సిఫార్సులను బట్టిగానీ యేర్పాటు చేయక మెరిట్‌ను బట్టి నియమించవలెననీ, ఇక్కడ మనకు దొరక్కపోయినా శ్రమపడి విచారించి ఉత్తముణ్ణి సంపాయించమనీ ప్రార్థిస్తున్నాము. అది మా ఒక్కరి అభిప్రాయం కాదు. అశేష ప్రజ వాంఛించే ఉత్తమ కోరిక. ఈ విషయంలో మీరు పప్పులో కాలేసినారంటే ఉత్తమ విద్యాసంస్థను చేతులార నాశనం చేసినారనే అపఖ్యాతిని మీ పుత్ర పౌత్ర పర్యంతం శాశ్వితం జేసిన వారేగాక పాప పంకిల భయం గూడా ఉన్నది సుమా జాగ్రత్త!!

### అల్లూరు కేసు

పోలీస్ స్టేషన్ తగులబెట్టిన కేసు ఆర్గుమెంటు జరుగుతున్నది. జడ్జిమెంటు ఇంకా 10 దినాలు పట్టవచ్చు.

–విమర్శకుడు

### సినిమా కబుర్లు

జెమిని వారి బాలనాగమ్మ 11–5–1943 నుండి నెల్లూరు వినాయక హాల్లో ప్రదర్శింపబడుతుంది.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

10-5-1963
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### పార్లమెంటు కాంగ్రెస్ పార్టీ!

తీవ్రమైన పోటీలలో, దేశదృష్టిని ఆకర్షించిన పార్లమెంటు కాంగ్రెస్ పార్టీ కార్యవర్గం ఎన్నికలో కృష్ణమీనన్ పదవీచ్యుతికి కారకులని భావించబడిన హరేకృష్ణ మెహతాబ్ ఉప నాయకత్వానికి ఓడి పోవడం, కమలనయన బజాజ్ కోశాధికారిత్వాన్ని కోల్పోవడం ముఖ్యాంశాలు. ఉప నాయకులుగా హెచ్.సి.దాసప్ప, పాతవాడైన సురేంద్రమోహన్ ఘోష్, కార్యదర్శులుగా రఘునాధసింగ్(పాతవాడు), విభూతి మిశ్రా, టి.ఎన్.పట్టాభిరామన్; కోశాధికారిగా రామేశ్వర తాంతియా ఎన్నికైనారు. కార్యవర్గంలో తెనుగు సభ్యురాలైన శ్రీమతి లక్ష్మీకాంతమ్మకు స్థానం లభించింది.

### నెల్లూరు ముచ్చట్లు

### చక్కెర పల్లెలకు పోలేదు

చక్కెర యింకా గ్రామాల వరకు పోలేదు. కాఫీ దాసులేగాక, రోగులు, బిడ్డలు సైతం చక్కెర దొరకక నానా యిక్కట్లు పడుతున్నారు. నిన్న, నేడు గ్రామాలలో చిల్లర వ్యాపారుల నియామకం జరుగుచున్నది. బహుశా ఈ వారంలో చక్కెర గూడా గ్రామాలకు చేరవచ్చు.

పల్లెలలో అసలు ఇప్పటికి చక్కెర ఇవ్వబడనందున కరవుగా వుంటే, నెల్లూరులో ఇవ్వబడడం, అయిపోవడం గూడా జరిగి పోయింది. చక్కెర అంగళ్లకు చేరిన మూడు, నాలుగు రోజులలోనే 'స్టాకు లేదు' అను బోర్డులు వ్రేలాడుతున్నవి. కలెక్టర్ చిల్లర వ్యాపారులకు ఎంత చక్కెర యిచ్చారో, వారు ఎంత పంపకం చేశారోగానీ, ఈనాడు తిరుగా ఒక్క గ్రాము కూడా దొరకడం లేదు.

–విమర్శకుడు

# నెల్లూరు ముచ్చట్లు

## నిద్రలేకుండా చేస్తున్న విద్యుత్ కోత!

నెల్లూరు విద్యుత్ శాఖాధికారుల బుర్రల్లో ఏ పురుగు తొలచిందో ఏమో విద్యుత్ కోత వేళలను అకస్మాత్తుగా మార్చారు. ఉదయం 9 గంటల నుంచి 11 గంటల వరకు విధిస్తుండిన విద్యుత్ కోత వేళలను 6వ తేది నుంచి నగర జనం బాగా నిద్రపోతుండే ఉదయం 5.30 గంటల నుంచి 7.30గంటలుగా చేశారు. గాలి బాగా బిగదీసి ఉండే ఆ వేళలో విద్యుత్ కోతలేమిటో ఎస్ఇ నందకుమార్‌నే ప్రజలకు వివరణ ఇవ్వాల్సి వుంది. ఇది ఇలా ఉండగా 8వ తేది ఈ విద్యుత్ కోత వేళలో మార్పు వచ్చింది.

## చంద్రబాబు రాక!

పాదయాత్రను విజయవంతంగా ముగించిన తెలుగుదేశం పార్టీ సర్వాధినేత చంద్రబాబు నాయుడు బస్సు యాత్రను జూన్ నెలలో నెల్లూరు నుంచే మొదలెట్టాలని యోచిస్తున్నారు. పార్టీ పొలిట్‌బ్యూరో సభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి కుమారుడు పెళ్లయ్యాక చంద్రబాబు పర్యటన తేదీలు ఖరారవుతాయని పార్టీ వర్గాల ద్వారా తెలిసింది.

## నెల్లూరీయులు 29 లక్షల మంది!

సరికొత్త జనాభా లెక్కల ప్రకారం జిల్లా జనాభా 29 లక్షల 63వేల 657 మందిగా తేలారు. వీరిలో 21,05,927 మంది గ్రామీణ ప్రాంతాల్లోనే ఉండగా 8,57,630 మంది పట్టణాల్లో ఉన్నట్లు లెక్క తేల్చారు. కుటుంబాల సంఖ్య 7,76,854గా నమోదయ్యింది. మొత్తం జనాభాలో 14,92,974 మంది స్త్రీలు, 14,70,530 మంది పురుషులున్నారు. జనాభాలో 6,66,588 మంది ఎస్సీలు, 2,85,997 మంది ఎస్టీలున్నారు.

6,31,791 మంది జనాభా ఉన్న మండలంగా నెల్లూరు రాష్ట్రస్థాయిలో నాల్గవస్థానంలో నిలవడం విశేషం.

## సివిల్స్‌లో నెల్లూరీయుల ప్రతిభ

యూనియన్ పబ్లిక్ సర్వీసు కమిషన్ నిర్వహించే సివిల్స్ సర్వీసు పరీక్షలో వెయ్యిలోపు నాలుగు ర్యాంకులను నెల్లూరు యువకులు సాధించారు. నెల్లూరు స్పెషల్ బ్రాంచి సిఐ వై.జయరామసుబ్బారెడ్డి తనయుడు శ్రీకాంత్‌రెడ్డి ఈ పరీక్షలో 326వ ర్యాంకు సాధించగా, ఆత్మకూరుకు చెందిన వివేకానందరెడ్డి 463వ ర్యాంకు, నెల్లూరుకు చెందిన దేవర కార్తీక్ 649, గుడిపల్లిపాడుకు చెందిన ఎ.సునీల్ 844వ ర్యాంకు సాధించి జాతీయ స్థాయిలో తమ సత్తా చాటారు.

## క్లబ్‌లో పేకాటకే అనుమతి!

పొదలకూరురోడ్డులోని నెల్లూరు క్లబ్‌లో ప్రస్తుతానికి 13 ముక్కల ఆట (రమ్మి)కి మాత్రమే ఎస్పీ రమణకుమార్ అనుమతించినట్లు నిర్వాహకులు స్పష్టం చేశారు. ఇప్పటికైతే గ్లాసుల గలగలలు లేవని భవిష్యత్తులో బార్ ఏర్పాటుకు సన్నాహాలు జరుగుతున్నట్లు చెప్పారు. గతంలో రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డికి కోపమొచ్చి కొట్టించిన క్లబ్ ప్రాంగణంలోని అదనపు భవన నిర్మాణాన్ని ప్రస్తుత కార్పొరేషన్ అనుమతించిందని, ఈ ఫైలు డైరక్టర్ ఆఫ్ టౌన్ ప్లానింగ్ అధికారుల పరిశీలనలో ఉన్నట్లు తెలిసింది. నెల్లూరు క్లబ్‌లో పేకాట జరగకుంటే క్లబ్ నడిచే పరిస్థితి లేనందున డిజిపి దినేష్‌రెడ్డిని ఒప్పించి ఇక్కడ ఈ 13 ముక్కల ఆట ఆడను అనుమతి సాధించడం పెద్ద విశేషంగా చెప్పుకోవచ్చు. అన్ని వసతులున్న నెల్లూరు క్లబ్‌ను ఫ్యామిలీ క్లబ్‌గా తీర్చిదిద్దను ప్రణాళిక రూపొందించినట్లు ప్రస్తుతం దీని బాధ్యతలు చూస్తున్న పెద్ద మనిషి స్పష్టం చేశారు. గతంలో జరిగిన అవినీతి అక్రమాలపై చర్యలకు ఉపక్రమిస్తున్నట్లు తెలిసింది. ఈ క్లబ్ సభ్యులలో అత్యధికులు నెల్లూరులో వివిఐపిలు కావడం వల్ల దీన్ని వాళ్లు ఏ విధంగానైనా నడుపుకోవడంలో సమర్థులని చెప్పక తప్పదు.

## రవాణా శాఖకు కొత్త ఉప కమిషనర్!

నెల్లూరు రవాణా శాఖ ఉప కమిషనర్‌గా మోహన్ 3వ తేది బాధ్యతలు స్వీకరించారు. విజయవాడలో డిటిసిగా ఈయన పనిచేసేవారు. ఇక్కడ ఉప కమిషనర్‌గా పనిచేస్తుండిన ప్రసాదరావును పదోన్నతిపై హైదరాబాద్‌లోని రవాణా శాఖ కార్యాలయంలో సంయుక్త కమిషనర్‌గా నియమించారు.

## కొండెక్కిన కూరగాయలు

ఎండల మూలంగా సాగు తగ్గడంతో కూరగాయల ధరలు కొండెక్కి కూర్చున్నాయి. టమోటా కిలో 30, వంకాయ, బీరకాయ, బెండకాయ, చేమ గడ్డలు 40 రూపాయలమ్ముతున్నారు. అల్లం కిలో 200 రూపాయలు, పచ్చిమిర్చి 50 రూపాయల ధరకు చేరుకొంది. మునక్కాయలు, కూర మామిడికాయల ధరలు మాత్రం సామాన్యులకు అందుబాటులో ఉన్నాయి.

## మెడికల్ కాలేజికి ప్రిన్సిపాల్ నియామకం

నెల్లూరు మెడికల్ కాలేజి ప్రిన్సిపాల్‌గా డాక్టర్ సతీష్ చంద్రను వైద్య ఆరోగ్య శాఖ నియమించింది. ఈయన ఉస్మానియా మెడికల్ కాలేజిలోని రేడియాలజీ విభాగంలో ప్రొఫెసర్‌గా పని చేస్తుండినాడు. వచ్చే వారంలో ఈయన బాధ్యతలు స్వీకరిస్తున్నట్లు తెలిసింది.

## కార్పొరేషన్ ఆఫీసులో విజిలెన్స్ తనిఖీలు!

ఎసిబి దాడుల తర్వాత నెల్లూరు విజిలెన్స్ అండ్ ఎన్‌ఫోర్స్‌మెంట్ అధికారులు కార్పొరేషన్ ఆఫీసులో అడుగు పెట్టారు. ఈ మధ్య కార్పొరేషన్ నేతృత్వంలో జరిగిన అభివృద్ధి కార్యక్రమాల తాలుకు ఫైళ్లనన్నింటినీ పరిశీలన చేస్తున్నారు. విజిలెన్స్ ఎస్పీ శశిధర్ రాజు గట్టి పిండం. ఆయన ఇక్కడ జరిగిన కొన్ని కుంభకోణాలనైనా వెలికి తీస్తారన్న నమ్మకం జనంలో వుంది.

## ఇడుపులపాయకు మేరిగ!

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ జిల్లా కన్వీనర్‌గా నియమితుడైన మేరిగ మురళి ఇడుపులపాయలోని డాక్టర్ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి సమాధిని సందర్శించి నివాళులర్పించారు. ఆయన వెంట పాపకన్ను రాజశేఖర్‌రెడ్డి, సన్నపరెడ్డి వెంకటసుబ్బారెడ్డి ఉండినారు.

## ట్రాన్స్‌కో రోకటిపోటు!

ఈ నెల విద్యుత్ శాఖ జారీచేసిన విద్యుత్ బిల్లులు చూసి షాక్ తినే పరిస్థితి వినియోగదారులది. 200 యూనిట్లు విద్యుత్ వాడకం దాటిన వారికి విద్యుత్ బిల్లు బాగా పెరగడంతోపాటు 2010 నవంబర్, 2012 అక్టోబర్ నెలలో వాడిన విద్యుత్‌కు ఒకేసారి ఎఫ్ఎస్ఏ కట్టమని బిల్లులు జారీ చేయడాన్ని మధ్యతరగతి ప్రజలు తట్టుకోలేక పోతున్నారు.

## రాపూరును నెల్లూరు డివిజన్‌లో ఉంచండి!

రాపూరు మండలాన్ని నెల్లూరు రెవిన్యూ డివిజన్‌లో ఉంచాలని రాపూరు

కొరవ 14వ పేజీలో









# మాలో విభేదాలు లేవు - మేమంతా ఒక్కటే!

● కాకాణి గోవర్ధన్‌రెడ్డి స్పష్టీకరణ



విలేకరుల సమావేశంలో మాట్లాడుతున్న కాకాణి గోవర్ధన్‌రెడ్డి.

నెల్లూరు జిల్లా వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ జిల్లా నేతల్లో విభేదాలు లేవని తామంతా జగన్మోహన్‌రెడ్డి వర్గమని ఆ పార్టీ కేంద్ర నిర్వాహక కమిటీ సభ్యుడు కాకాణి గోవర్ధన్‌రెడ్డి స్పష్టం చేశారు. కలెక్టర్ బంగ్లా వద్ద గల తన కార్యాలయంలో అనిల్ కుమార్ యాదవ్, రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి, కొమ్మి లక్ష్మయ్య నాయుడుతో కలసి విలేకరులతో మాట్లాడారు. పార్టీ జిల్లా కన్వీనర్ మేరిగ మురళి తొలిసారిగా నెల్లూరుకు వచ్చిన సందర్భంలో కొందరు నేతలు రాలేకపోవడంలో ఎటువంటి దురుద్దేశం లేదన్నారు. వీలుగాక కొందరు రాలేకపోయారు. కానీ దీనిపై మీడియాలో చిలువలు పలువలుగా వ్రాసేశారు. జిల్లా పార్టీ కార్యాలయం బోర్డు పదిలంగానే ఉంది. మరో వైపున బోర్డు మాత్రమే మారిందన్నారు. ఏదిఏమైనా జిల్లా నాయకులంతా ఏకత్రాటిపై నడుస్తున్నామన్నారు. జిల్లా పార్టీ కన్వీనర్‌గా దళిత వర్గానికి చెందిన మేరిగ మురళిని ఎంపిక చేయడం ముదావహమన్నారు. ఏదిఏమైనా వైఎస్ఆర్‌సిపి నీడలో తామంతా ఎదుగుతామే తప్ప ఆ చెట్టుకొమ్మను తెగ నరుక్కునేతంటి మూర్ఖులం కాదన్నారు. రానున్న ఎన్నికల్లో దాదాపుగా సమన్వయకర్తలకే టిక్కెట్లు కేటాయించే అవకాశాలు కనిపిస్తున్నాయన్నారు. అందుకే తమను సమన్వయకర్తలుగా కూడా నియమించి ముందు నుంచే పార్టీని నియోజకవర్గాల వారీగా పట్టి పరుచుకోవాలని జగన్ సూచించారన్నారు. తమ పార్టీని విమర్శించే నైతిక హక్కు తెలుగుదేశం పార్టీకి లేదని కాకాణి స్పష్టం చేశారు.

# నన్నంటే... జగన్‌ను అన్నట్లే!

## తేల్చి చెప్పిన కొమ్మి



తనను ఎవరైనా తప్పుపడితే అది తమ పార్టీ అధినేత జగన్‌ను తప్పుబట్టినట్లేనన్న వింత వాదనకు తెరతీశాడు వైకాపా వెంకటగిరి నియోజకవర్గ సమన్వయకర్త కొమ్మి లక్ష్మయ్యనాయుడు. 3వ తేది పార్టీ జిల్లా కార్యాలయంలో విలేకరులతో మాట్లాడుతూ నన్ను వెంకటగిరి నియోజకవర్గ సమన్వయకర్తగా నియమించడాన్ని కొందరు తప్పుపడుతున్నారు. అసలు నన్ను ఆత్మకూరులో పార్టీ అభివృద్ధికి కృషి చేయమని మొదట జగన్మోహన్ రెడ్డి సూచించారు. ఆ పని చేస్తుండగానే ఆయనే నన్ను వెంకటగిరి నియోజకవర్గ సమన్వయకర్తగా నియమించారు. ఆ ప్రకారంగానే నేను నడుచుకొంటున్నాను. కానీ అక్కడ కొందరు నాయకులు నన్ను తప్పు పట్టడం దురదృష్టకరమన్నారు. ఈ పరిణామం జగన్మోహన్‌రెడ్డినే తప్పు పట్టినట్లు అవుతుందన్నారు. జిల్లా కన్వీనర్ మేరిగ మురళి కుటుంబంతో తనకు ఎంతో సాన్నిహిత్యం ఉందని, ఆయన నెల్లూరు వచ్చిన రోజు తాను ఇక్కడ లేకపోవడం వల్లే ఆ కార్యక్రమానికి హాజరుకాలేక పోయినట్లు లక్ష్మయ్య చెప్పుకొచ్చారు.

# రిజర్వేషన్లపై అధికారుల కుస్తీ!

గ్రామ పంచాయితీ ఎన్నికల నిర్వహణకు సంబంధించి రిజర్వేషన్లను ఖరారు చేసేందుకు అధికారులు కుస్తీ పడుతున్నారు. ఇప్పటికే ఓటర్ల జాబితాలు సిద్ధంచేసి కులాలవారీగా విభజన చేయడం జరిగింది. రాష్ట్ర ప్రభుత్వం గ్రామ పంచాయితీ ఎన్నికలు నిర్వహించేందుకు కసరత్తు చేయాలని అధికారుల్ని ఆదేశించడంతో ప్రస్తుతం ఎస్సీ, ఎస్టీ, బిసి రిజర్వేషన్లపై తర్జన భర్జన పడాల్సి వచ్చింది. 2001 జనాభా లెక్కల ప్రకారం రిజర్వేషన్లు ఖరారు చేస్తారని ఒక ప్రక్క, కాదు 2011 జనాభా లెక్కల ప్రకారం రిజర్వేషన్లు చేస్తారని మరో ప్రక్క ప్రచారం వుంది. గత వారంలో 2011 జనన గణన వివరాలు కూడా వెల్లడి చేసింది ప్రభుత్వం. ఎన్నికల సంఘం నుంచి కూడా స్పష్టమైన మార్గదర్శకాలు అందలేదని అధికారులు చెబుతున్నారు. గ్రామ పంచాయితీ ఎన్నికలకు తయారుచేసిన ఓటరు జాబితాలో జిల్లావ్యాప్తంగా 14 లక్షల ఓటర్లు వున్నట్లు నమోదు చేశారు. 2011 జనాభా లెక్కల ప్రకారం 29 లక్షలకుపైగా జనాభా వున్నారు. ఏ క్షణంలోనైనా ఎన్నికల సంఘం నుంచి ఎన్నికల నోటిఫికేషన్ వెలువడే అవకాశం వుండడంతో అనధికారికంగా రిజర్వేషన్లు చేసే పంచాయితీ వార్డులను గుర్తించే పనిలో పడ్డారు. గత రెండు నెలల నుంచి స్థానిక సంస్థల ఎన్నికలు జరుగుతాయన్న ప్రచారం ఊపందుకోవడంతో రాజకీయ పార్టీలు సైతం తమ ప్రయత్నాలు ప్రారంభించి సభలు, సమావేశాలు నిర్వహిస్తున్నాయి.

**పంచాయితీ ఎన్నికలా? మజాకా?**

● గొలుసుకట్టు

# బాధితులకు న్యాయం చేయండి!

## తెలుగు యువత డిమాండ్




వివరాలు వెల్లడిస్తున్న పమిడి రవికుమార్ చౌదరి.

జిల్లాలో గొలుసుకట్టు వ్యాపారం చేసి జనాన్ని మోసగించిన సంస్థలను తక్షణం ఫాస్ట్‌ట్రాక్ కోర్టులను ఏర్పాటుచేసి బాధితులకు న్యాయంచేసే విధంగా చర్యలు తీసుకోకుంటే ఉద్యమిస్తామని తెలుగు యువత జిల్లా అధ్యక్షుడు పమిడి రవికుమార్ చౌదరి హెచ్చరించారు. 3వ తేది తెలుగుదేశం పార్టీ కార్యాలయంలో విలేకరులతో మాట్లాడారు. హిమ్, న్యూవిజన్ ఫౌండేషన్, భారతీయ ప్రేమసదన్, యూత్ అండ్ స్ట్రెంత్, యూత్ అలైవ్ సొసైటి తదితర సంస్థల పేరుతో నెల్లూరు, ప్రకాశం, గుంటూరు జిల్లాలలో ప్రజల నుండి కోట్లాది రూపాయలు వసూలు చేశారన్నారు. ఒక్క నెల్లూరు నగరంలోనే లక్ష మంది వద్ద నగదు కట్టించుకొని మోసం చేశారని విమర్శించారు. గొలుసు కట్టు వ్యాపారంలో జిల్లాలో 283 కోట్ల రూపాయల స్కామ్ జరిగిందని, ఇప్పటివరకు సిబిసిఐడి అధికారులు కేవలం 50 కోట్ల రూపాయలను రికవరీ చేసినా ప్రజలకు ఈ మొత్తాన్ని పంచలేదన్నారు. ఈ స్కీమ్‌లు నిర్వహించిన వ్యక్తులను అరెస్ట్‌చేసి వారి ఇళ్లు, ఫ్లాట్లు, కార్లు, బంగారం రికవరీచేసి ఆ సొమ్మును ప్రజలకు పంపిణీ చేయాలన్నారు. మనీస్కీంలో డబ్బులు కట్టి పలు కుటుంబాలు ఆర్థికంగా చితికి పోయాయన్నారు. ఈ వ్యవహారాలను తమ పార్టీ అధినేత చంద్రబాబుతో పాటు డిజిపి దినేష్‌రెడ్డిని కలసి విన్నవించి ఆందోళన పథం పడుతామన్నారు. వాస్తవానికి ఈ వ్యవహారంపై తెలుగుదేశం పార్టీ ఎప్పుడో ఉద్యమించాల్సింది. ఆలస్యంగానైనా మేలుకోవడం అభినందనీయం.



# కలెక్టర్ దూకుడు!

**ఇన్నాళ్లు ఇంత మెత్తగా ఎందుకున్నారు సార్!**

జిల్లా కలెక్టర్ శ్రీధర్ తన పంథా మార్చారు. ఆయన జిల్లాకు విచ్చేసి రెండేళ్లు పూర్తయ్యింది. ఈ రెండేళ్ల కాలంలో ఆయన ఎవ్వరినీ నొప్పించక తన పనేదో తాను అన్నట్లున్నారు. విద్యార్థులపై ప్రేమ చూపుతూ వారి విద్యాభివృద్ధికి వినూత్న పథకాల రూపకల్పన, విధి నిర్వహణ చేస్తున్నారు. అలాంటి కలెక్టర్ ఉన్నట్లుండి ఉగ్రనరసింహావతారం ఎత్తారు. విధి నిర్వహణలో అలసత్వం ప్రదర్శించే అధికారులపై కొరడా ఝుళిపించడంతోపాటు ఆకస్మిక తనిఖీలతో హడలెత్తిస్తున్నాడు. ఇటీవల ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి రాపూరు పర్యటన సందర్భంగా పారిశుధ్య నిర్వహణలో నిర్లక్ష్యంగా వ్యవహరించినందుకు రాపూరు ఎమ్పీడిఓను, ఇఓ పిఆర్‌డిని, కార్యదర్శిని సస్పెండ్ చేశారు. ఈ ఉత్తర్వులు కూడా జడ్పీ సిఇఓకు చెప్పి నిమిషాల వ్యవధిలో ఇప్పించడం కలకలం రేపింది. ఇదే దూకుడుతో కలెక్టర్ తన కార్యాలయం, అదే ఆవరణలోగల పలు కార్యాలయాలు, పలు విభాగాలలో ఆకస్మిక తనిఖీ జరిపారు. సాధారణంగా కలెక్టరేట్, డిఆర్‌డిఏ, రెవిన్యూ విభాగాలలో ఉదయం రావాల్సిన సిబ్బంది 11 గంటలైనా సీట్లో కూర్చోరు. దీనిపై పలు ఫిర్యాదులు అందడం, తన దృష్టికి రావడంతో కలెక్టర్ ఉదయం 9 గంటలకల్లా కార్యాలయానికి చేరుకొని తనిఖీలు జరపడంతో ఉద్యోగులు హడలి పోయారు. ఇళ్లలో కూర్చుని వున్న వారు ఈ సమాచారం అందుకొని పరుగులు పెడుతూ కార్యాలయాలకు రాగా, చెట్ల క్రింద, టీ అంగళ్ల వద్ద బాతాఖానీ కొడుతున్న సిబ్బంది ఆగమేఘాలపై తమ కుర్చీలలో వాలి పోవడం వివిధ సమస్యలపై కలెక్టరేట్‌కు వచ్చి వున్న ప్రజలకు నవ్వు తెప్పించింది. తన అలవాట్లకు భిన్నంగా జిల్లా కలెక్టర్ విధి నిర్వహణలో అలసత్వం ప్రదర్శించే వారిపై కరకుగా వ్యవహరించడం చర్చనీయాంశమయ్యింది. ఇదే మాదిరిగా కలెక్టర్ ముందు ముందు వ్యవహరిస్తే పాలన గాడిలో పడుతుందని ప్రజలు వ్యాఖ్యానిస్తున్నారు.

# మనీస్కీం దర్యాప్తు ఎన్నాళ్లు?

జిల్లాలో మనీస్కీం కేసు దర్యాప్తు కాశీ మజిలీ కథలా చిత్రవిచిత్రమైన మలుపులు తిరుగుతోంది. ఈ కేసులో పోలీసులు దర్యాప్తు చేపట్టి రెండేళ్ళు గడుస్తున్నా ఇంతవరకు ఒక కొలిక్కి రాలేదు. దర్యాప్తు జరుపుతున్న పోలీస్ అధికారులు మారుతున్నారే తప్ప మనీస్కీంలో డబ్బులు కట్టి నష్టపోయిన ప్రజలకు మాత్రం న్యాయం అందని ద్రాక్షలా మారుతోంది. క్రిస్టియన్ సంస్థల పేరుతో కొందరు జిల్లా ప్రజల దగ్గర్నుంచి మనీస్కీం పేరుతో పెద్ద మొత్తంలో డబ్బు వసూలు చేశారు. ఒకటికి పదిరెట్లు డబ్బు వస్తుందనే ఆశచూపి కోట్లాది రూపాయలు వసూలు చేసిన సంస్థలు ఆ తర్వాత బోర్డు తిప్పేశాయి. దీనిపై పోలీసులకు ఫిర్యాదులందడంతో జిల్లా ఎస్పీ ఈ కేసు దర్యాప్తు బాధ్యతలు సిఐడికి అప్పగించారు. సిఐడి డిఎస్పీగా విజయకుమార్ కేసులో కీలక నిందితులను అరెస్టుచేసి, కోట్లాది రూపాయల నగదు, ఖరీదైన వాహనాలు స్వాధీనం చేసుకొన్నారు. బాధితులందరికీ న్యాయం చేస్తామని అధికారులు ప్రకటించడంతో తాము కట్టిన డబ్బులు తిరిగి వస్తాయని ఆశించారు. అయితే విచారణ పేరుతో డిఎస్పీగా వుండిన విజయకుమార్ అవినీతికి పాల్పడినట్లు పలు సంఘాలు డిజిపి, ఉప ముఖ్యమంత్రికి ఫిర్యాదులు చేయడంతో వారు స్పందించి విజయకుమార్‌పై వేటువేశారు. ఆయన స్థానంలో కొత్త వారిని నియమించారు. అయితే ఇంత వరకు ఒక్క రూపాయి కూడా మనీస్కీంలో డబ్బు కట్టి నష్టపోయిన వారికి అందలేదు. ఇదిగో అదిగో అంటూ సిఐడి కాలయాపన చేస్తుందే తప్ప కేసును త్వరితగతిన పూర్తిచేసి న్యాయం చేయడంలో తగిన విధంగా వ్యవహరించ లేదన్న విమర్శలు వ్యక్తమౌతున్నాయి.

**పాపం బాధితులు**

# కాకాణి, సోమిరెడ్డిపై విసుర్లు

## మాటల్లో పదును పెంచిన ఆదాల



రాజకీయాలలో ఎవరిని విమర్శించకుండా తన పని తాను చేసుకపోయే సర్వేపల్లి ఎమ్మెల్యే ఆదాల ప్రభాకర్‌రెడ్డి తన పంథా మార్చాడు. తనను లక్ష్యంగా చేసుకొని వైకాపా నేత కాకాణి గోవర్ధన్‌రెడ్డి విమర్శలు చేస్తున్న నేపథ్యంలో ఆయన విమర్శలను తిప్పికొట్టేందుకు సిద్ధమయ్యాడు. కాంగ్రెస్ భిక్షతో జిల్లా పరిషత్ ఛైర్మన్ అయిన కాకాణి నేడు వేరే పార్టీలో చేరి పదవుల కోసం ప్రాకులాడుతున్నాడని, అసత్యాలు మాట్లాడుతున్నాడని ప్రతి విమర్శ చేశారు. ప్రభుత్వాలు అధికారంలో వున్నప్పుడు ఎన్నో సంక్షేమ పథకాలు ప్రవేశ పెడుతుంటాయి. అవి సహజమన్నారు. అంత మాత్రాన అవి వారి వ్యక్తిగత పథకాలు కాదన్నారు. ఇటీవల నియోజకవర్గ పరిధిలో జరిగిన సబ్‌ప్లాన్, అమ్మహస్తం కార్యక్రమాల్లో పాల్గొన్న ఆయన ఈ విధంగా వ్యాఖ్యానించారు. ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి నేతృత్వంలోని ప్రభుత్వం పేదల కోసం ఎన్నో పథకాలు ప్రవేశపెడుతున్నారని, వేల కోట్ల రూపాయల నిధులు మంజూరు చేస్తున్నారని తెలిపారు. అలాగే బూడిద పేరుతో ప్రజలను రెచ్చగొట్టి కమీషన్లు దండుకొనేందుకు మరోనేత ప్రయత్నిస్తున్నారని పేరు చెప్పకుండా సోమిరెడ్డిని విమర్శించారు. ఒక్కసారిగా ఆదాల తన మాటల్లో పదును పెంచడం నియోజకవర్గంలో చర్చనీయాంశమయ్యింది.



# కొత్తూరులో యోగాంజనేయస్వామి!



ఇందుకూరుపేట మండలం కొత్తూరులో యోగాంజనేయస్వామి విగ్రహ ప్రతిష్టాపన కార్యక్రమం వైభవంగా జరిగింది. స్థానికుడు, కర్నాటకలో వ్యాపార రంగంలో ఉన్నతస్థితికి చేరుకున్న కలికి కోదండరామిరెడ్డి గతంలో ఇదే ప్రాంతంలో శ్రీ షిరిడీ సాయిబాబా ఆలయాన్ని నిర్మించిన సంగతి తెలిసిందే. ఈ ఆలయ పంచమ వార్షికోత్సవం సందర్భంగా ఆలయానికి ఎదురుగా యోగముద్రలో వున్న ఆంజనేయస్వామి విగ్రహాన్ని ప్రతిష్టించారు. మే 3న జరిగిన ఈ కార్యక్రమానికి సాయిబాబా ఆలయ ట్రస్టు కోదండరామిరెడ్డి దంపతులతోపాటు భక్తులు అధికసంఖ్యలో హాజరయ్యారు. బెంగుళూరుకు చెందిన వేదపండితుల నేతృత్వంలో ఈ ప్రతిష్టాపన జరిగింది. ఆలయం ప్రహరీగోడ నలువైపులా 59మంది దేవతామూర్తుల విగ్రహాలు కొలవుదీరి వుండడం భక్తులను ఆకట్టుకొంటున్నాయి. యోగాంజనేయ విగ్రహ ప్రతిష్టాపన మహోత్సవంతోపాటు షిరిడీ ఆలయ వార్షికోత్సవం సందర్భంగా సుందరకాండ గానం, సీతారాముల కళ్యాణం, టివి రమణారావుచే భజన కార్యక్రమం, గరుడ అవార్డు గ్రహీత ఆంజనేయులు ఆధ్వర్యంలో ఆంజనేయ చరిత్ర నాటక ప్రదర్శనలు జరిగాయి. ట్రస్టుసభ్యులు అన్నదాన కార్యక్రమాన్ని నిర్వహించారు.

● జిల్లా రాజకీయల్లో

# కలికిది చెరగని ముద్ర!

## వర్ధంతి సభలో విష్ణు

మాజీ మంత్రి దివంగత నేత, కావలి రాజకీయాలలో చెరగని ముద్ర వేసిన కలికి యానాదిరెడ్డి ఏడవ వర్ధంతి కాంగ్రెస్ పార్టీ ఆధ్వర్యంలో జరిగింది. ఉదయగిరి బ్రిడ్జి కూడలిలో నిర్వహించిన ఈ వర్ధంతి సభలో మాజీ ఎమ్మెల్యే కాటంరెడ్డి విష్ణువర్ధన్‌రెడ్డి మాట్లాడుతూ కావలి ప్రాంత అభివృద్ధికి యానాదిరెడ్డి ఎంతగానో కృషి చేశారన్నారు. పేదల కోసం, వారి అభ్యునతి కోసం ఎంతగానో పాటుపడ్డారని ఘన నివాళులు అర్పించారు. డిసిసి మాజీ అధ్యక్షుడు, కాంగ్రెస్‌పార్టీ సీనియర్ నేత సివి.శేషారెడ్డి మాట్లాడుతూ ఎన్‌టిఆర్ గాలిలో కూడా జిల్లాలో అన్ని స్థానాలలో తెలుగుదేశం పార్టీ ఎమ్మెల్యేలు గెలిస్తే కావలిలో మాత్రం యానాదిరెడ్డి గెలిచిన విషయాన్ని గుర్తు చేశారు. అంతటి ప్రజా బలం గల నేత కలికి అని కొనియాడారు. ఈ కార్యక్రమంలో ఎఎంసి మాజీ ఛైర్మన్ గ్రంధి యానాదిశెట్టి, జిల్లా గ్రంధాలయ సంస్థ ఛైర్మన్ ప్రవీణ్‌కుమార్‌రెడ్డి, గోసాల గోపాలరెడ్డి, కేతిరెడ్డి జగదీష్‌రెడ్డి, వేదగిరి, సుబ్బరాయుడు గుప్త, యాదగిరి, కనమర్లపూడి వెంకటనారాయణ, కలికి శ్రీధర్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

### వైకాపా ఆధ్వర్యంలో

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నేతలు కూడా కలికి యానాదిరెడ్డికి నివాళులు అర్పించారు. ఆయన వర్ధంతిని పురస్కరించుకొని ఉదయగిరి బ్రిడ్జి సెంటర్‌లో గల యానాదిరెడ్డి విగ్రహానికి పూలమాలలు వేసి నివాళులు అర్పించారు వైకాపా నేత రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి. కలికి యానాదిరెడ్డి ప్రజల మనసుల్లో చిరస్థాయిగా నిలచిపోయారని కొనియాడారు. ప్రతాప్ వెంట చింతం బాబుల్‌రెడ్డి, తిరివీధి ప్రసాద్, మాల్యాద్రి, కిషోర్, వెంకట్రావు, బ్రహ్మారెడ్డి, ప్రభాకర్‌లు పాల్గొని యానాదిరెడ్డికి పూలమాలలు వేసి అంజలి ఘటించారు.



బిట్రగుంట కాంగ్రెస్ నాయకుడు కర్రెద్దుల రమేష్ కుమార్తె మధురిమ, జవహర్‌ల వివాహం 4వ తేది కావలిలో జరిగిన సందర్భంలో వధూవరులకు శుభాకాంక్షలు అందజేస్తున్న మాజీ ఎమ్మెల్యే విష్ణువర్ధన్‌రెడ్డి, దామిశెట్టి శ్రీనివాసులు నాయుడు.



218 రోజులపాటు పాదయాత్ర చేసిన తెలుగుదేశం పార్టీ సర్వాధినేత చంద్రబాబు నాయుడిని హైదరాబాద్‌లో కలసి పుష్పగుచ్ఛం అందిస్తున్న కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు, పార్టీ సీనియర్ నేత నాయుడు రాంప్రసాద్.



సూళ్లూరుపేట మునిసిపాలిటీలో 2 కోట్ల 8లక్షల రూపాయలతో చేపట్టనున్న అభివృద్ధి పనులకు శంకుస్థాపన చేస్తున్న ఎమ్మెల్సీ వాకాటి నారాయణరెడ్డి. ప్రక్కన ఇసనాక హర్షవర్ధన్‌రెడ్డి, మునిసిపల్ కమిషనర్ కనకరావు.

# రామిరెడ్డి ప్రజాదీవెన యాత్ర!

## ● బోగోలులో బాగా జరిగింది



కావలి నియోజకవర్గ ఇన్‌చార్జి రామిరెడ్డి ప్రతాప్ కుమార్‌రెడ్డి నిర్వహిస్తున్న ప్రజాదీవెన యాత్ర బోగోలు పంచాయితీ పరిధిలో జరిగింది. తొలుత స్థానిక బజారు సెంటర్‌లో వున్న అంబేద్కర్, వైఎస్ రాజశేఖర్‌రెడ్డి విగ్రహాలకు పూలమాల వేసి నివాళులు అర్పించిన అనంతరం ఈ యాత్ర చేపట్టారు ప్రతాప్‌కుమార్‌రెడ్డి. బడుగు, బలహీన వర్గాల వారికోసం ఎన్నో పథకాలను ప్రవేశపెట్టిన ఘనత వైఎస్ రాజశేఖర్‌రెడ్డిదని కొనియాడారు. వైఎస్ తనయుడైన జగన్ ముఖ్యమంత్రి అయితేనే వైఎస్ ఆశయాలు, కన్న కలలు నెరవేరుతాయన్నారు. అధికార కాంగ్రెస్‌పార్టీ, ప్రతిపక్ష తెలుగుదేశంపార్టీలు కుట్ర చేసి జగన్‌ను జైలుపాలు చేశాయని, నేడు అవే పార్టీలు జగన్ జైలు నుంచి విడుదల కాకుండా కుట్రలు పన్నుతున్నాయని ఆరోపించారు. వచ్చే ఎన్నికలలో జగన్‌కు అండగా నిలచి కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలకు బుద్ధి చెప్పాలని కోరారు. జిల్లా యూత్‌కాంగ్రెస్ ఉపాధ్యక్షుడు మేకల శ్రీనివాసులు తన అనుచరులు 500 మందితో కలసి వచ్చి ఈ సందర్భంగా వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీలో చేరారు. అలాగే ముస్లిం యువకులు 50మంది వైకాపా తీర్థం పుచ్చుకున్నారు. వీరందరికి ప్రతాప్‌కుమార్‌రెడ్డి, బోగోలు మండల వైకాపా కన్వీనర్ తూపిలి పెంచలయ్య, అల్లూరు మండలానికి చెందిన బీద రమేష్‌లు కండువాలు కప్పి పార్టీలోకి ఆహ్వానించారు. ఈ కార్యక్రమంలో దగదర్తి మండల కన్వీనర్ గోగుల వెంకయ్య, సుంకి మాల్యాద్రి తదితరులు పాల్గొన్నారు.

# పదవులను అడ్డం పెట్టుకొని సంపాదించడం చేతకాదు!

## కలువాయిలో కొమ్మి లక్ష్మయ్యనాయుడు



పదవులు అడ్డంపెట్టుకొని డబ్బు సంపాదించడం తనకు చేతకాదని, ప్రజలిచ్చిన అధికారాన్ని ప్రజాసేవకే వినియోగించానని మాజీ శాసనసభ్యుడు, వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ వెంకటగిరి నియోజకవర్గ సమన్వయకర్త కొమ్మి లక్ష్మయ్యనాయుడు స్పష్టం చేశారు. కొందరు నేతలు రాజకీయాల్లోకి వచ్చి పదవులు పొంది వ్యాపారాలు, కాంట్రాక్టులు చేసుకొని కోట్లకు పడగలెత్తారని, తనకు అలాంటి అలవాట్లు లేవన్నారు. రెండు పర్యాయలు ప్రజలు తనను ఎమ్మెల్యేగా చేశారని, ఆ అధికారాన్ని ప్రజాసేవకు అంకితం చేశానన్నారు. కలువాయి మాజీ మండలాధ్యక్షుడు, కాంగ్రెస్ నేత అనిల్ కుమార్‌రెడ్డి తన అనుచరులతో కలసి వైకాపా తీర్థం పుచ్చుకొన్నారు. ఈ సందర్భంగా కలువాయిలో బహిరంగసభ నిర్వహించారు. ముఖ్యఅతిథిగా విచ్చేసిన కొమ్మి తన రాజకీయ ఎదుగుదల, టిడిపి వీడడంపై కుండబద్దలు కొట్టినట్లు ప్రసంగించారు. సమితి అధ్యక్షుడిగా వున్న తనను ప్రజలే రెండుసార్లు శాసన సభ్యుడిని చేశారన్నారు. ప్రతిక్షణం కష్టపడి పని చేసి తెలుగుదేశం పార్టీకి గుర్తింపు తెచ్చానన్నారు. అలాంటి పార్టీలో తన గౌరవానికి భంగం కలగడంతో టిడిపి నుంచే కాక రాజకీయాల నుంచే తప్పుకోవాలనుకొన్నానన్నారు. ఆ దశలో వైఎస్ జగన్ పిలుపు మేరకు ఆపార్టీలో చేరానని వివరించారు. పార్టీ మారేటప్పుడు కొందరిలా సెటిల్‌మెంట్లు చేసుకొని వైకాపాలో చేరలేదన్నారు. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ప్రజాహృదయ నేత అని ప్రశంసించారు. రానున్న ఎన్నికల్లో జగన్ సిఎం కావడం తథ్యమన్నారు. వైఎస్ భిక్షతో పదవులు పొంది రాజకీయంగా ఆర్థికంగా ఎదిగిన కొందరు ఆ కుటుంబంపైన, జగన్‌పైన విమర్శలు చేయడాన్ని తీవ్రంగా ఖండించారు. నెల్లూరు, కావలి నియోజకవర్గ సమన్వయకర్తలు అనిల్‌కుమార్ యాదవ్, రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి మాట్లాడుతూ పేద ప్రజల గుండె చప్పుడు తెలిసిన కొమ్మి లక్ష్మయ్యనాయుడు వెంకటగిరి నియోజకవర్గ ఇన్‌చార్జి కావడం ప్రజల అదృష్టమన్నారు. ఈ కార్యక్రమంలో వైకాపా నేతలు వరప్రసాదరావు, పట్టాభిరామిరెడ్డి, చిరంజీవిరెడ్డి, రూప్‌కుమార్ యాదవ్, శ్రీకాంత్‌రెడ్డి, వీరరాఘవరెడ్డి, డాక్టర్ రాజశేఖర్‌రెడ్డి, భాస్కర్‌గౌడ్ తదితరులు పాల్గొన్నారు.

## ● కావలి ఎమ్మెల్యేను

# పొగిడిన మంత్రి రామనారాయణ!

## ఆశ్చర్యపోయిన కాంగ్రెస్ కార్యకర్తలు





కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావును ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి ప్రశంసలతో ముంచెత్తారు. దానగుణ శీలుడు, పేదలకు సహాయం చేసేందుకు నిత్యం పరితపించే గొప్ప వ్యక్తి అని ఆర్థికమంత్రి తెగపొగిడారు. కావలి పట్టణంలో ఇటీవల జరిగిన వివిధ అభివృద్ధి కార్యక్రమాలకు శంకుస్థాపన, అమ్మహస్తం పథకం ప్రారంభ కార్యక్రమంలో ఇది జరిగింది. కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా వచ్చిన రామనారాయణరెడ్డి మాట్లాడుతూ పట్టణంలో 85లక్షలతో నిర్మించిన మినీ స్టేడియంలో మరిన్ని వసతుల కల్పనకు 2.9కోట్లతో ప్రతిపాదనలు సిద్ధం చేస్తున్నామన్నారు. ప్రజలకు త్రాగునీటి ఇబ్బందులు కలుగకుండా వుండేందుకు మరో సమ్మర్ స్టోరేజ్ ట్యాంకును నిర్మిస్తామన్నారు. ఈ సందర్భంగా కావలితో తమ కుటుంబానికి వున్న అనుబంధాన్ని గుర్తు చేసుకొన్నారు. అంతవరకు బాగానే వున్నా వున్నట్లుండి బీద మస్తాన్‌రావును మంత్రి కీర్తించడంతో సభలో వున్న కాంగ్రెస్‌పార్టీ నాయకులు ఆశ్చర్యపోయారు. కావలి నియోజకవర్గానికి ఎమ్మెల్యే బీద 340కోట్ల రూపాయల నిధులను సాధించుకొన్నాడని, ఆయన్ను చూసి తనలాంటి వారూ ఎంతో నేర్చుకోవాలని ప్రశంసించారు. దీనికి బిఎంఆర్ స్పందిస్తూ పార్టీలు వేరైనా అభివృద్ధి కార్యక్రమాల విషయంలో పూర్తి సహకారం అందిస్తానన్నారు.

# చిల్లకూరులో అభివృద్ధి పనులకు శ్రీకారం!

చిల్లకూరు మండలంలో పలు అభివృద్ధి కార్యక్రమాలకు ఆర్థికమంత్రి ఆనం రామనారాయణరెడ్డి శంకుస్థాపన చేశారు. ఇటీవల మంత్రి ఈ ప్రాంతంలో విస్తృతంగా పర్యటించి దాదాపు 15 కోట్ల రూపాయల అభివృద్ధి పనులకు శ్రీకారం చుట్టారు. తీరప్రాంత గ్రామాలైన వరగలి, గుమ్మళ్ళదిబ్బ, ఏరూరు ప్రాంత ప్రజలకు వైద్యం కోసం వరగలిలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని మంజూరు చేశారు. విద్యుత్ సబ్ స్టేషన్‌ను మంజూరు చేశారు. ఇక్కడే ఇంటిగ్రేటెడ్ హాస్టల్‌ను మంజూరు చేస్తున్నట్లు ప్రకటించారు. అలాగే ప్రభుత్వం ప్రతిష్టాత్మకంగా నిర్వహిస్తున్న అమ్మహస్తం పథకాన్ని ప్రారంభించారు. ఈ పథకం క్రింద 185 రూపాయలకే తొమ్మిది రకాల సరుకులను ప్రభుత్వం అందిస్తున్నాదన్నారు. వస్తువుల ధరలు ఎంత పెరిగినా ఈ ప్యాకేజ్ సరుకులను మాత్రం ఇదే ధరకే అందిస్తాం తప్ప ధర పెంచబోమని స్పష్టం చేశారు. ఈ ప్రాంతంలో అభివృద్ధి కార్యక్రమాలు ఇంత పెద్దఎత్తున జరగడానికి కారణం యరటపల్లి జానకిరామిరెడ్డేనని మంత్రి అభినందించారు. ఈ కార్యక్రమంలో శాసనమండలి సభ్యుడు వాకాటి నారాయణరెడ్డి, నియోజకవర్గ ఇన్‌చార్జి పనబాక కృష్ణయ్య, మండల కాంగ్రెస్‌పార్టీ నాయకులు మధురెడ్డి, నందవరం సుబ్బారావు, జాయింట్ కలెక్టర్ లక్ష్మీకాంతం, గూడూరు సబ్ కలెక్టర్ నివాస్ తదితరులు పాల్గొన్నారు.

## రూ.15 కోట్లు వెచ్చించనున్నారు

● అల్లూరు దళితవాడలో

# తాగునీటి సమస్య పరిష్కారానికి కృషి!

అల్లూరు దళితవాడ ప్రజలు చాలాకాలంగా ఎదుర్కొంటున్న మంచినీటి సమస్యకు పరిష్కారం దొరికింది. ఇటీవల కావలి శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు ఈ ప్రాంతంలో పర్యటించినపుడు ఇక్కడి ప్రజలు తాము ఎదుర్కొంటున్న త్రాగునీటి ఇబ్బందులను ఆయన దృష్టికి

**పైపులైన్ల నిర్మాణానికి రూ.6లక్షలిచ్చిన బీద**

తీసుకొని వచ్చారు. గతంలో వారానికి రెండుసార్లు మాత్రమే నీరు అందేదని, ఇప్పుడు ఆ నీరూ రాక సుదూర ప్రాంతాలకు వెళ్లి మంచినీటిని తెచ్చుకోవాల్సిన పరిస్థితులు ఏర్పడుతున్నాయని ఆవేదన వ్యక్తం చేశారు. దీనికి స్పందించిన బీద మస్తాన్‌రావు మంచినీటి సమస్యపై పంచాయితీ కార్య నిర్వహణాధికారి చక్రం వెంకటేశ్వర్లుతో మాట్లాడారు. దీనికి ఆయన సమాధానమిస్తూ ప్రభుత్వ హాస్పిటల్ వెనుక వున్న చెరువు నుంచి, ప్రక్కనే వున్న రెండు చెరువుల నుంచి పైపు లైన్లు వేస్తే మంచినీటి సమస్య తీరుతుందని తెలిపారు. వెంటనే ఎమ్మెల్యే తన సొంత నిధుల నుంచి ఆరులక్షల రూపాయలు పైపులైన్ల ఏర్పాటుకు మంజూరు చేస్తున్నట్లు ప్రకటించారు. పని పూర్తయ్యే వరకు బిఎంఆర్ ట్రస్టు తరపున ట్రాక్టర్ల ద్వారా త్రాగునీరు సరఫరా చేస్తామని హామీ ఇచ్చారు. అలాగే డ్రైనేజి వ్యవస్థను సరిదిద్దడంపైనా అధికారులకు సూచనలు చేశారు. బీద మస్తాన్‌రావు హామీతో స్థానికులు హర్షం వ్యక్తం చేశారు.

● విచ్చలవిడిగా

# మందుల అమ్మకాలు!

## చిల్లరంగళ్లలో మందులు

ఆరోగ్యానికి సంబంధించిన ఔషధాల అమ్మకాలకు సంబంధించి నిర్దిష్టమైన నియమనిబంధలను విధించి వుంది ప్రభుత్వం. సంబంధిత డ్రగ్ లైసెన్స్ పొందిన వాళ్లు మందుల అమ్మకాలు జరపాల్సి వుండగా జిల్లాలో ఈ నింబంధన అమలు కావడం లేదు. చిన్నచిన్న చిల్లర అంగళ్లలో కూడా వివిధ రకాల మందులను, మాత్రలను అమ్ముతుండడంతో ప్రజలు ప్రాణాలమీదకు తెచ్చుకొంటున్నారు. ప్రతి మందుకు ఎక్స్‌పైరీ డేట్ వుంటుంది. చిల్లర అంగళ్లు, చిన్నచిన్న దుకాణాల వారు మెడికల్ షాపుల నుంచి వివిధ రకాల మందులను కొనుక్కొని వెళ్లి వాటిని తమ వద్దకు వచ్చే అమాయక ప్రజలకు అమ్మేస్తుండడంతో వాటిని కొని వాడిన వారికి ప్రాణాపాయం ఏర్పడుతోంది. కావలి రూరల్ మండలంలో గమనిస్తే ఈ అమ్మకాలు అధికంగా జరుగుతున్నాయి. జ్వరం, తలనొప్పి తదితర సమస్యలకు డాక్టర్ వద్దకు వెళ్లలేక అంగళ్లలో అమ్మే మాత్రలను కొని వినియోగిస్తుండడంతో కొన్ని సమయాల్లో అవి వికటించి అనారోగ్యానికి గురై ఆస్పత్రుల పాలవుతున్నారు ప్రజలు. దీనిపై తనిఖీ జరపాల్సిన సంబంధిత డ్రగ్ ఇన్స్‌పెక్టర్‌లు ఆ విషయం పట్టించుకోకపోవడంతో ప్రజల ప్రాణాలతో వ్యాపారులు చెలగాటమాడుతున్నారు.

# కళాకారులను ఆదుకోవాలి!

జిల్లాలో కళాకారులు, కళారంగం దయనీయ స్థితిలో వున్నాదని, వీరిని ప్రోత్సహించేందుకు ప్రభుత్వం సహకారం అందించాలని కోవూరు శాసనసభ్యుడు నల్లపురెడ్డి ప్రసన్న కుమార్‌రెడ్డి విజ్ఞప్తి చేశారు. ఇటీవల బుచ్చిరెడ్డిపాళెం కళాసాగర్ ఆధ్వర్యంలో జరిగిన నాటక పోటీల్లో విజేతలకు బహుమతి ప్రదానోత్సవం కార్యక్రమం జరిగింది. దీనికి ముఖ్యఅతిధిగా విచ్చేసిన ప్రసన్న కళలు, కళారంగం, కళాకారులు పడుతున్న బాధలను ప్రత్యేకంగా ప్రస్తావించారు. కళాకారులు, కళలు ఎక్కడ సుభిక్షంగా వుంటాయో ఆ ప్రాంతం అభివృద్ధి చెందుతుందన్నారు. నేటి యువత కళామతల్లి ముద్దు బిడ్డలైన కళాకారుల గురించి తెలుసుకోవాలన్నారు. బుచ్చిలో ఆడిటోరియం నిర్మాణానికి తనవంతు కృషి చేస్తానని హామీ ఇచ్చారు. మహిళలపై పెరుగుతున్న ఆకృత్యాలపై ఆవేదన వ్యక్తం చేశారు. ఈ నాటకాల్లో ఉత్తమ ప్రదర్శన కనపరచిన 'ఒక్కమాటచాలు' ప్రదర్శనకు ప్రథమ బహుమతి అందజేశారు. ఈ కార్యక్రమంలో జిల్లా సహకార అధికారి సుబ్బారావు, సూరా శ్రీనివాసులరెడ్డి, వైకాపా మండల కన్వీనర్ టంగుటూరు మల్లిఖార్జున్‌రెడ్డి, పిడుగు మధు, కళాసాగర్ అధ్యక్షులు దొడ్ల రమణయ్య యాదవ్ తదితరులు పాల్గొన్నారు.

# బిసి సంఘం అధ్యక్షునిగా దేవరాల!

బిసి సంక్షేమ సంఘం అడ్‌హక్ కమిటి జిల్లా అధ్యక్షుడిగా దేవరాల సుబ్రహ్మణ్యం యాదవ్ నియమితులయ్యారు. ఈ మేరకు బిసి సంక్షేమ సంఘం రాష్ట్ర అధ్యక్షుడు ఆర్ కృష్ణయ్య ఈ నియామకం జరిపారు. నూతన బాధ్యతలు చేపట్టిన సుబ్రహ్మణ్యం యాదవ్ ఇటీవల హైదరాబాద్‌లో ఆర్.కృష్ణయ్యను కలసి తన నియామకం పట్ల కృతజ్ఞతలు తెలిపారు. బడుగు బలహీన వర్గాల సంక్షేమం కోసం నిరంతరం కృషి చేస్తూ, వారి హక్కుల పరిరక్షణకు ఉద్యమించాలని సూచించారు. దీనికి దేవరాల స్పందిస్తూ జిల్లాలో బలహీన వర్గాల అభ్యున్నతికి తనవంతు కృషి చేస్తానని హామీ ఇచ్చారు. బిసి కులాలను సంఘటిత పరచి హక్కుల కోసం ఉద్యమిస్తామన్నారు. ఈ కార్యక్రమంలో రాష్ట్ర బిసి మహిళా సంఘం ప్రధాన కార్యదర్శి పెరుమాళ్ల పద్మజ, కావలి నియోజకవర్గ బిసి సంఘం అధ్యక్షుడు పంది పెనుకొండయ్య, బోగోలు మండల బిసి సంఘం అధ్యక్షుడు ఉరిటి గోవిందరావు, కావలి అధ్యక్షుడు గండికోట కృష్ణయ్య, ద్రోణాదుల వెంకట్రావ్, పద్మావతి, శంకరయ్య, నారాయణ, శ్రీనివాసులు, నాగరాజు, మాలకొండారెడ్డి తదితరులు పాల్గొన్నారు.

జాతీయ పోటీ పరీక్షా విధానం మారినా 2013 JEE Main ఫలితాలను నిర్దేశించాం.. నిరూపించాం..

# 'ఆలిండియా ఫస్ట్ మార్క్' తో శ్రీచైతన్య నారాయణ




## ఆలిండియా ఓపెన్ కేటగిరీలో 320 పైగా మార్కులు సాధించిన మా విద్యార్థులు 32

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 331/360 | 330/360 | 330/360 | 330/360 | 327/360 | 326/360 | 326/360 | 326/360 | 325/360 | 325/360 |
| 325/360 | 325/360 | 324/360 | 323/360 | 323/360 | 323/360 | 322/360 | 322/360 | 322/360 | 322/360 |
| 321/360 | 321/360 | 321/360 | 321/360 | 321/360 | 321/360 | 320/360 | 320/360 | 320/360 | 320/360 |

## ఆలిండియా ఓపెన్ కేటగిరీలో 300 పైగా మార్కులు సాధించిన మా విద్యార్థులు 134

| | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 318 | 318 | 317 | 316 | 316 | 316 | 316 | 316 | 315 | 315 | 315 | 315 | 315 | 315 | 315 |
| 314 | 314 | 314 | 313 | 313 | 313 | 312 | 312 | 311 | 311 | 311 | 311 | 311 | 310 | 310 |
| 310 | 310 | 310 | 310 | 310 | 310 | 310 | 310 | 310 | 310 | 310 | 310 | 310 | 310 | 309 |
| 309 | 309 | 309 | 309 | 308 | 308 | 307 | 307 | 307 | 307 | 307 | 306 | 306 | 306 | 306 |
| 306 | 305 | 305 | 305 | 305 | 305 | 305 | 305 | 304 | 304 | 304 | 304 | 304 | 304 | 304 |
| 303 | 303 | 302 | 302 | 302 | 302 | 302 | 301 | 301 | 301 | 301 | 301 | 301 | 301 | 301 |
| 301 | 300 | 300 | 300 | 300 | 300 | 300 | 300 | 300 | 300 | 300 | 300 | 300 | | |

### 300 పైగా మార్కుల సాధించిన వారి విశ్లేషణ

| మార్కులు | విద్యార్థుల సంఖ్య | మార్కులు | విద్యార్థుల సంఖ్య |
|---|---|---|---|
| 345 ఆపై | 1 | 320 ఆపై | 32 |
| 341 ఆపై | 2 | 315 ఆపై | 47 |
| 335 ఆపై | 2 | 310 ఆపై | 75 |
| 330 ఆపై | 6 | 305 ఆపై | 101 |
| 325 ఆపై | 13 | 300 ఆపై | 134 |

జేఈఈ పరీక్షల్లో వచ్చిన మార్కులకు అనుగుణంగా JEE - Main, Advanced లలో ఆలిండియా 10 లోపు, 100 లోపు ర్యాంకులే లక్ష్యంగా IIT దిగ్గజాలు ఒక్కటిగా... సరికొత్త రికార్డులకై ఒకే వేదికగా..

చైనా బ్యాచ్ CO IPL ప్రోగ్రామ్ అడ్మిషన్లకై సంప్రదించండి :

| సైఫాబాద్ అశ్వినిపూర్ హైదరాబాద్ | కాపులు హిల్స్ మాదాపూర్ హైదరాబాద్ | మయూరి భవన్ గుడివాడకారు కాలనీ, విజయవాడ. | వేదవ్యాస్ భవన్ అరవిందా, వైజాగ్. | వేదవ్యాస్ భవన్ బాపు చంద్ర, అనంత. | ధనలక్ష్మీపురం నెల్లూరు. |
|---|---|---|---|---|---|
| 9247088401 | 9248080813 | 9246495924 | 9290835183 | 9908638027 | 9912343803 |

### JEE- ADVANCED- 2013 కు వివిధ కేటగిరీలలో అర్హత సాధించిన మా విద్యార్థులు

| | |
|---|---|
| OC 113 మార్కులు ఆపై | 8922 |
| OBC 70 మార్కులు ఆపై | 5694 |
| SC 50 మార్కులు ఆపై | 1598 |
| ST 45 మార్కులు ఆపై | 678 |

# శ్రీచైతన్య నారాయణ IIT అకాడమి

# వారఫలాలు

*తేది 11-5-2013 నుండి 17-5-2013 వరకు మేషంలో కుజ, కేతువులు, రవి 12తేదీ వరకు తదుపరి వృషభంలో, బుధుడు 14తేది వరకు తదుపరి వృషభంలో; వృషభంలో గురు, శుక్రులు యుతి; తులలో శని, రాహువులు; వృషభ, మిథున, కర్కాటకాలలో చంద్రుడు సంచరిస్తారు.*

**మేషం** (అశ్విని, భరణి, కృత్తిక 1 పా)
ఈ వారం కూడా గ్రహస్థితి ప్రతికూలంగా వుండడం వల్ల తలపెట్టిన పనులలో అనేక ఇబ్బందులుంటాయి. ఉద్యోగులకు బదిలీలు, ఇంటాబయట అవమానాలు తప్పవు. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలలోని వారికి ఆర్థిక ఇబ్బందులు మనస్సును బాధిస్తాయి. విద్యార్థులు మిత్రుల సహాయసహకారాలతో కొన్ని సమస్యల నుండి బయటపడతారు. ఈ రాశి వారు ముఖ్యంగా కోపోద్రేకులు కావద్దు.

**వృషభం** (కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా)
వృత్తి, వ్యాపారాలు అంతగా అనుకూలించవు. ఆదాయానికి మించి ఖర్చులు, కుటుంబంలో స్పర్ధలు, ఏమి మాట్లాడినా విరోధమే. ప్రభుత్వ సంబంధ చిక్కులు. వ్యవహారాలందు నష్టం. శారీరక శ్రమ, అకాల భోజనం. విద్యార్థులకు శ్రమానంతర ఫలితాలు. వ్యవసాయదారులకు ఆర్థిక ఇక్కట్లు తగ్గుతాయి. కళా, క్రీడా రంగాల వారికి వృత్తి వివాదాలు తగ్గుతాయి. లౌకిక విషయాలపై ఆసక్తి అవసరం.

**మిథునం** (మృగశిర 3,4 పా. ఆర్ద్ర, పునర్వసు 1,2,3 పా)
గతవారం కన్నా మేలు. వృత్తి, వ్యాపారాలలోనివారు రాణిస్తారు. తలపెట్టిన అన్ని వ్యవహారాలు క్రమంగా ఫలిస్తాయి. కొన్ని సమయాలలో అపజయం, ధన వ్యయం తప్పదు. కుటుంబంలో సమస్యలు, ప్రయాణాలందు ఇబ్బందులుంటాయి. ఆర్థికలబ్ధికై ఎక్కువ సమయం వృథా చేస్తారు. విద్యార్థులలో బుద్ధిబలం తగ్గుతుంది. వ్యూహాత్మక ఆలోచనలు ఫలించవు. వ్యవసాయదారులకు క్రమంగా ఆర్థికవృద్ధి.

**కర్కాటకం** (పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష)
అన్నింటా అనుకూల లాభాలే. చేసే వృత్తి, వ్యాపారాలు అనుకూలిస్తాయి. నూతన కార్యలాభం. విద్యార్థులకు అత్యంత అనుకూలం. వ్యవసాయదారులకు ఆదాయానికి మించిన ఖర్చులు, కళా, క్రీడాకారులకు వృత్తిపరమైన నష్టాలు. కుటుంబ చిక్కులు. ఇంట్లో జరుగు శుభకార్యాలలో ఆర్భాటాలకు, ఆడంబరాలకు ధన వ్యయమవుతుంది. స్వయం వృత్తుల వారికి ఆశాజనకం.

**సింహం** (మఖ, పుబ్బ, ఉత్తర 1 పా)
ఈ రాశి వారికి శుభాశుభ మిశ్రమంగా వుంటుంది. తలపెట్టిన పనులలో ఆటంకాలెదురైనా అధిగమించే ప్రయత్నం చేస్తారు. ఆర్థికంగా, ఆరోగ్యపరంగా బాగుంటుంది. వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆర్థిక లావాదేవీలు సంతృప్తినిస్తాయి. కుటుంబంలో చిన్నపాటి సమస్యలు తలెత్తవచ్చు. విద్యార్థులు చురుకుగా వుంటారు. వ్యవసాయ, కళా, క్రీడా రంగాలవారికి ఆత్మవిశ్వాసం పెరుగుతుంది.

**కన్య** (ఉత్తర 2,3,4పా. హస్త, చిత్తా 1, 2 పా)
గ్రహాల ప్రతికూలతల వల్ల అనేక సమస్యలు ఎదుర్కోవలసి వస్తుంది. ఆలోచనలు, ఆందోళనలు శరీరారోగ్య సమస్యలను సృష్టిస్తాయి. కోర్టు కేసులలో ఇరుక్కోవడం లేదా సమస్యలు జటిలమవడం వుంటుంది. నమ్మినవారు మోసగించడం వల్ల ఊహించని సమస్యలు బాధిస్తాయి. రాజకీయుల నూతన ఆలోచనలు లాభిస్తాయి. రాజీలేని ధోరణిలో ముందుకు నడుస్తారు. వివాదాస్పద అంశాలపై చర్చ వద్దు.

## పంచాంగం

- 11తేది కృత్తికా కార్తె. నిజకర్తరీ ప్రారంభం.
- 12తేది బలరామ జయంతి. సింహాచల చందనోత్సవం, రజబ్ నెల ప్రారంభం.
- 13తేది అక్షయ తృతియ, నాగ చతుర్థి, పరశురామ జయంతి.
- 14తేది వృషభ సంక్రాంతి, హరిపద పుణ్యకాలం.
- 15తేది జగద్గురు ఆదిశంకరాచార్య జయంతి.
- 16తేది పుత్ర ప్రాప్తి వ్రతం.
- 17తేది విద్యారణ్య జయంతి.

### శుభ ముహూర్తాలు

11తేది నుండి వివాహాది శుభ కార్యాలకు, సీమంత, అన్నప్రాసన, అక్షర స్వీకారాది సామాన్య కార్యక్రమాలకు శుభముహూర్తాలున్నాయి.

### మే తిథులు
వైశాఖ శుద్ధ

| | | | | |
|---|---|---|---|---|
| 11 | శని | పాడ్యమి | ప | 07.58 గం.ల.వ |
| 12 | ఆది | విదియ | ప | 10.17 గం.ల.వ |
| 13 | సోమ | తదియ | ప | 12.46 గం.ల.వ |
| 14 | మంగళ | చవితి | ప | 03.18 గం.ల.వ |
| 15 | బుధ | పంచమి | సా | 05.42 గం.ల.వ |
| 16 | గురు | షష్ఠి | రా | 07.49 గం.ల.వ |
| 17 | శుక్ర | సప్తమి | రా | 09.27 గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్డ సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు - 2. సెల్: 95819 76599.

**తుల** (చిత్తా 3,4 పా, స్వాతి, విశాఖ 1,2,3 పా)
తలపెట్టిన పనులలో అన్ని రంగాల వారికి కలసిరాదు. మనశ్శాంతి కరువవుతుంది. ప్రతి రోజూ ఏదో ఒక సమస్యతో ఇబ్బందులు. రుణ ప్రయత్నాలు చేయడం, ఆరోగ్యరీత్యా ఇబ్బందులు, అనవసర విషయాలలో తలదూర్చ వద్దు. విద్యార్థులు బుద్ధిబలంతో తగు నిర్ణయాలు తీసుకోవాలి. వ్యవసాయదారులకు కొన్ని ఇబ్బందులు తప్పవు. ఆర్థికంగా సామాన్యంగా వుంటుంది.

**వృశ్చికం** (విశాఖ 4 పా, అనూరాధ, జ్యేష్ఠ)
వృత్తి, వ్యాపారాలలో ఆటంకాలు, అనుకోని సంఘటనలు, వ్యవహారాలలో నష్టాలుంటాయి. స్త్రీ సౌఖ్యం, కుటుంబ సౌఖ్యం తక్కువ. శారీరక శ్రమ, ఆరోగ్య భంగం, ఔషధ సేవ, బంధుమిత్రులతో విరోధాలుంటాయి. సంజాయిషీలు, సంభాషణలు తరచుగా వుంటాయి. విద్యార్థులకు తల్లిదండ్రుల, విద్యాధికారుల అండదండలు లభిస్తాయి. వ్యవసాయదారులు స్థిర నిర్ణయాలు తీసుకొంటారు.

**ధనుస్సు** (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)
ప్రితార్జిత అంశాలపై దృష్టి, సహచరులతో భేదాభిప్రాయాలు సమసిపోతాయి. స్వయం వృత్తుల వారికి ప్రోత్సాహకరం. రుణాన్వేషణకు సమయం కేటాయిస్తారు. సమయస్ఫూర్తితో లబ్ధి పొందుతారు. రాజకీయ నాయకులకు అనుకోని రీతిలో గర్వభంగం. కీలక నిర్ణయాలు వాయిదా వేయడం మేలు. వ్యవసాయదారులకు తలపెట్టిన పనులలో విజయం. కళా, క్రీడలలోని వారికి పనుల్లో ఆటంకాలు తొలగుతాయి.

**మకరం** (ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)
తలపెట్టిన పనులలో ఆటంకాలు, సమయస్ఫూర్తితో వెళ్లినా లబ్ధి చేకూరదు. గుప్త సమాచారాన్ని సేకరించలేరు. శక్తికి మించిన కార్యాలలో తలదూర్చ వద్దు. ఇతరులకు చేసే హామీలకై సమయం వృథా చేస్తారు. స్పెక్యులేషన్ రాణించదు. విద్యార్థులు బుద్ధి బలంతోనే నిర్ణయాలు తీసుకోవాలి. అవివాహితులకు శుభవార్త. వృత్తి, వ్యాపారాలు రాణిస్తాయి. రావలసిన బాకీలు వసూలౌతాయి.

**కుంభం** (ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా)
తలపెట్టిన పనులన్నీ సులువుగా పూర్తవుతాయి. అన్నివిధాల యోగమే. దూర ప్రయాణాలు, బంధుమిత్రుల కలయిక, ఆటంకాలతో వున్న కొన్ని సమస్యలు తొలగుతాయి సంతాన సౌఖ్యం, భూసంబంధ వ్యవహారాలు లాభిస్తాయి. సాంఘికంగాను, మానసికంగాను ఉత్సాహంతో వుంటారు. విద్యార్థులకు తమ విద్యలపై చిన్న చిన్న ఆటంకాలున్నా అన్ని విధాల బాగుంటుంది.

**మీనం** (పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి)
వృత్తి, వ్యాపారాలు క్రమేణా పుంజుకుంటాయి. ఆరోగ్యం అంతంత మాత్రమే. అవసరార్థం దూర ప్రయాణాలు చేయవలసి వస్తుంది. నూతనకముల పరామర్శలు తప్పవు. సంతాన వ్యతిరేకత చూస్తారు. భవిష్యత్ ప్రణాళికలు వేస్తారు. కుటుంబ వాతావరణాన్ని అనుకూలంగా మార్చుకొంటే ప్రశాంతత వుంటుంది. విద్యార్థులకు పరీక్షా కాలం. వ్యవసాయదారులకు కార్యసిద్ధికి ఆటంకాలుంటాయి.

# 'దిక్' అవాస్తు దోషాలు కుటుంబానికి 'త్రివిధ' శాపాలు!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*జి.ఎన్.ఆర్ — శ్రీకాళహస్తి*
** మా యిల్లు పూర్తిగా శిథిలమైంది. స్థలం అమ్మలేక, ఇల్లు కట్టలేక మా అవస్థలు అవస్థలు కాదు.*

సుదీర్ఘమైన ఉత్తరం చదివాను. ప్లాను చూశాను. తూర్పు ఇల్లు, ఈశాన్యం సెప్టిక్ ట్యాంకు వల్ల అగాధమయ్యింది. 'వికృత దైత్య' దోషం వల్ల తండ్రి, సోదరుడు మరణించారు. యంత్ర ప్రతిష్ఠ జరిగి వుంటే ప్రాణ నష్టం తప్పి వుండేది.

*ఎల్వీ శకుంతల — ఖైరతాబాద్*
** మంగళవారం ఏ పనీ చేయకూడదా?*

మంగళకరం అంటే శుభప్రదమని అర్థం. మంగళ, శుక్రవారాల పట్ల సమాజంలోని అభిప్రాయాలు పరమ ఛాందసమైనవి.

*పి.వి.ఆర్ — బెంగుళూరు*
** అమ్మాయి మానసికంగా బాధ పడుతోంది. ఇంట్లో ఎట్లాంటి సమస్యలు లేవు.*

అమ్మాయిని తొలుత మానసిక వైద్యుడికి చూపించండి. పుట్టిన నక్షత్రం రీత్యా పుష్యరాగం (ప్రథమార్థ కుడి చిటికెన(బుధ) వ్రేలికి ధరిస్తే ఫలితం వుంటుంది.

*డాక్టర్ అశోక్ — తిరుపతి*
** రాయల ఆకస్మిక మరణానికి కారణం ఏమిటి?*

కర్మపారబ్ధం విధిలిఖితం. అయితే ఉగ్రన్రుసింహ ఆలయం అసమగ్రతే ఆయనకు చెడు ప్రాప్తించడానికి కారణమని వాస్తు శాస్త్రజ్ఞుల అభిప్రాయం. ఆ భయంతోనే ఇతర రాజులెవరూ ఉగ్రనృసింహుడి జోలికి వెళ్లలేదు.

*సి.ఊర్మిళ — హిందూపురం*
** వివాహ విషయంలో గుణమేళన ప్రధానమైనదా?*

ఇది చాలా సామాన్యమైనది. వ్యతిరేక వేధో నక్షత్రాల వారిని వివాహం చేసుకోకపోవడం చాలా మంచిది.

*టి.కె.ఆర్ — తిరుపతి*
** ఆర్థిక పరిస్థితి అస్తవ్యస్తమై పోయింది. అతను పూర్తిగా చెడిపోయాడు.*

అధైర్య పడకండి. గణనలో నిర్ధారింపబడిన యంత్ర ప్రతిష్ఠ, రుద్రాక్ష మండలం పూజావిధానం వల్ల మీ కుటుంబ పరిస్థితి కుదుట పడుతుంది. ఈ విషయమై శాస్త్రాలు హామీ ఇస్తాయి.

*పి.ఈశ్వరమ్మ — బలిజపాళెం*
** చాలా పెద్ద ఆపద తప్పిపోయింది. ఈశాన్య కుంభ ప్రతిష్ఠ చేయడం చాలా మేలయింది.*

భగవంతుడు అనుగ్రహించబట్టే మీరు శాస్త్రరీత్యా అన్ని పద్ధతులూ పాటించారు. ఈశాన్య కుంభ ప్రతిష్ఠ అయ్యాక మండలం రోజులు రాత్రి పూట అక్కడ ప్రమిదను వెలిగించి పెట్టండి.

*డాక్టర్ పి.శేషశర్మ — అనంతపురం*
** జాతక రచనలో పూర్వ సిద్ధాంతాల్ని గురించి చెప్పండి?*

ద్వాదశ(పన్నెండు) సిద్ధాంత జాతకం బాగా ప్రచారంలో వుంది. దక్షిణాదిలో అగస్త్యుడు ప్రచారం చేసిన నవగ్రహ సిద్ధాంత జాతకమూ ప్రసిద్ధి చెందింది.

*ఎన్.రుద్రాణి — కందుకూరు*
** ఒకే నక్షత్రమైతే వధూవరులు వివాహమాడవచ్చునా?*

శాస్త్రం ఈ విషయంలో వ్యతిరేకత చూపడం లేదు. అయితే పూర్వ గ్రంథాలలో కొన్ని నక్షత్రాల విషయంలో అభిప్రాయబేధాలున్నాయి.

*టి.కె.రమణారెడ్డి — వరికుంటపాడు*
** వాస్తు లోపాలు మీతో చర్చించాలి. మూఢం కదా అందువల్ల ఆలస్యమవుతోంది.*

సలహా సంప్రతింపులు, వాస్తు చూపించుకోవడం, జాతకాలు రాయించుకోవడం మౌఢ్యమి రోజుల్లో చేయవచ్చు. మరీ ఛాందసాలకు పోకండి.

*టి.దమయంతి — కర్నూలు*
** జన్మ నక్షత్రం ప్రకారం తల్లికి దోషమన్నారు. ఏం చేయమంటారు?*

జ్యోతిష శాస్త్ర ప్రకారం సరిగ్గా చూశారా? పండితుడు పాండిత్యం గలవాడేనా? అని సందేహిస్తున్నాను. 'మృగశిర' నక్షత్రం వల్ల ఎవరికీ దోషం లేదు. అయినా శిశు నక్షత్ర జనన పాద దోషం ఓ పెద్ద ఛాందసం, ఈ కాలంలో పాటించాల్సిన అవసరం లేదు.

# గ్రామాల్లో తాగునీటికి కటకట!



పెన్నానదిలో త్రవ్వుకొన్న చలమలోని నీళ్లను బిందెల్లో నింపుకొంటున్న దృశ్యం.

**జిల్లాలోని చాలా గ్రామాల్లో తాగునీటి సమస్య ఉన్నా అధికార యంత్రాంగం ముందస్తు చర్యలు తీసుకోకపోవడంతో ఇది మరింత జఠిలమయ్యింది. మంచినీటి సమస్య మొదలయ్యాక బావిని తవ్వుకొన్న సామెతను ప్రతి ఏడాది గ్రామీణ నీటి సరఫరా అధికారులు గుర్తుకు తెస్తున్నారు.**

జిల్లావ్యాప్తంగా తాగునీటి సమస్య తలెత్తింది. గత రెండు నెలల నుంచి తాగునీటి ఎద్దడి ఏర్పడినప్పటికి అధికార యంత్రాంగం ముందస్తు చర్యలు చేపట్టలేకపోయింది. పట్టణ ప్రాంతాలతో పాటు గ్రామీణ ప్రాంతాల్లో తాగునీటి కోసం ప్రజలు ఇక్కట్లు పడుతున్నారు. ప్రజల దాహార్తిని తీర్చేందుకు తాగునీటి ప్రాజెక్టుల నిర్మాణాలకు శ్రీకారం చుట్టారు. కాని వీటి నిర్వహణకు మాత్రం ప్రత్యేక శ్రద్ధ కనబరచడం లేదు. గ్రామీణ నీటి సరఫరా విభాగం ఆధ్వర్యంలో తాగునీటి పథకాలు నిర్మించిన నిర్వహణ బాధ్యతల్ని గ్రామ పంచాయితీలకు అప్పగిస్తారు. పైపు లైన్ల మరమ్మత్తులు గానీ, మోటార్లు కాలిపోయినా గ్రామ పంచాయితీలే ఖర్చు భరించాల్సి వుంటుంది. జిల్లావ్యాప్తంగా ఇదే తంతూ నడుస్తుంది.

మండల కేంద్రాల్లో గ్రామీణ నీటి సరఫరా విభాగానికి సంబంధించి ఎఇ ఒకరుంటారు. అయితే ఎఇ దగ్గర మాత్రం ఆయా మండలాల పరిధిలోని ఏ గ్రామంలో తాగునీటి సమస్య ఉత్పన్నమైందో తెలిపే సమాచారం వుండదు. ప్రతిరోజు తాగునీటి ఎద్దడి గురించి వివిధ పత్రికల్లో కథనాలు వస్తున్నా స్పందించే అధికారి లేకుండాపోయారు. ప్రతి సంవత్సరం వేసవిలో అనేక మండలాల్లో తాగునీటి ఎద్దడి ఏర్పడే విషయం అధికారులకు తెలుసు. అయినప్పటికి ముందస్తు చర్యలు మాత్రం వుండడం లేదు. ఒక ప్రక్కమండే ఎండలు, మరో ప్రక్క విద్యుత్ కోతలతో మరిన్ని సమస్యలు ఏర్పడుతున్నాయి. గ్రామ పంచాయితీల పరిధిలోని గ్రామాల్లో తాగునీటి సమస్య ఏర్పడినప్పుడు నిధులకొరత సాకుగా చూపి అధికారులు తప్పించుకొంటున్నారు. మండలస్థాయిలో ఎమ్పీడిఓలు పర్యవేక్షణ చేసి సమస్య లేకుండా చూడాలని జిల్లా కలెక్టర్ పలు సందర్భాల్లో ఆదేశించిన సంగతి తెలిసిందే.

తాగునీటి ప్రాజెక్టుల నిర్మాణాలకు కోట్ల రూపాయలు వ్యయం చేస్తున్న ప్రభుత్వం వాటి నిర్వహణ మాత్రం నిధులు కేటాయించడం లేదని అధికారులు వ్యాఖ్యానిస్తున్నారు. కొన్ని గ్రామాలకు 5 నుంచి 10 కిలోమీటర్ల దూరం నుంచి పైపు లైన్ల ద్వారా తాగునీటిని సరఫరా చేస్తున్నారు. ఏమాత్రం ఇవి మరమ్మత్తులకు గురయ్యి రోజులు తరబడి తాగునీరు సరఫరా నిలిచిపోతుంది. అధికారుల చుట్టూ తిరగలేక ప్రైవేటు కంపెనీలు సరఫరా చేసే వాటర్ క్యాన్లపై ఆధారపడాల్సిన పరిస్థితి ఏర్ప డింది. గతంలో బావులు, చలమల నుండి నీరు తెచ్చే వారు. ఈ దఫా వర్షాలు ఆశించిన మేర కురవక పోవడంతో చెరువులు, బావులు, చల మల్లో నీరు నిల్వవుండే అవకాశం లేదు.

భూగర్భ జలాలు అడుగంటిపోవడంతో ఇతర అవసరాలకు నీటికోసం కిలోమీటర్ల దూరం వెళ్లి వాహనాల ద్వారా తెచ్చుకొంటున్నారు. ఇటీవల జిల్లా కలెక్టర్ ఎమ్పీడిఓలతో నిర్వహించిన సమీక్షా సమావేశంలో తాగునీటి ఎద్దడి లేకుండా అన్ని చర్యలు తీసుకోవాలని ఆదేశించారు. కాని తాగునీరు సరఫరాలేని ప్రాంతాలకు ప్రైవేటు వాహనాల ద్వారా రవాణా చేయాల్సి వుంటుంది. ఇందుకు అవసరమైన నిధులు జిల్లా కలెక్టర్ ద్వారా మండలాలకు విడుదల చేయాలి. నిధుల కొరత గురించి ఎమ్పీడిఓలు జిల్లా కలెక్టర్‌ను ప్రశ్నించే ధైర్యం చేయలేక ఆయన చెప్పిన మాటలకు తలలూపాల్సి వచ్చింది. గ్రామీణ ప్రాంతాలతోపాటు నెల్లూరు, కావలి, వెంకటగిరి, ఆత్మకూరు మునిసిపాల్టీలలో తాగునీరు సక్రమంగా సరఫరా కావడం లేదు. నెల్లూరు నగరంలోని మునిసిపల్ కొళాయిల్లో రంగునీళ్లు సరఫరా అవుతున్నాయి. ఇవి తాగేందుకు పనికిరాకుండా పోవడంతో వాటర్ క్యాన్లను కొనుగోలు చేస్తున్నారు.

సోమశిల రిజర్వాయర్ నుంచి నీటిని విడుదల చేస్తే తాగునీటి సమస్య కొంతమేర తీరే అవకాశం వుంది. వేసవి కాలం సమీపించక ముందే తాగునీటి ఎద్దడి గ్రామాలను గుర్తించి వాహనాల ద్వారా రెండు పూటలా తాగునీటిని సరఫరా చేయాల్సి వుంటుంది. కాని అధికారులు ఆ విషయం పూర్తిగా మరచి సమీక్షా సమావేశాలు జరిపి సరిపెడుతున్నారు.



# విజయవంతంగా నీట్!

- **నెల్లూరు ఆతిథ్యానికి నివ్వెరపోయిన సీమ జిల్లాల వాసులు**



పరీక్షలు వ్రాస్తున్న విద్యార్థులు.

వైద్య విద్యలో ప్రవేశానికై జాతీయ స్థాయిలో ప్రప్రథమంగా నిర్వహించిన నేషనల్ లెవల్ ఎలిజిబిలిటీ ఎంట్రన్స్ టెస్ట్(నీట్)కు అధిక సంఖ్యలో విద్యార్థులు హాజరయ్యారు. గతంలో ఇంజనీరింగ్, మెడికల్ విద్యార్థులకు కామన్‌గా ఎంసెట్ పరీక్ష నిర్వహించేవారు. ఈ ఏడాది దీనికి భిన్నంగా మెడిసిన్ కోర్సు చేయాలనుకొనే వారు ఎంసెట్‌తోపాటు నీట్‌ను తప్పనిసరిగా వ్రాయాలనే నిబంధన విధించింది ప్రభుత్వం. ఈ పరీక్ష నిర్వహణకు నెల్లూరులో మొత్తం పదకొండు పరీక్షా కేంద్రాలను ఏర్పాటు చేశారు. గోమతి స్కూల్ కరస్పాండెంట్ అరుణను ఈ పరీక్ష నిర్వాహకురాలిగా నియమించారు. చిత్తూరు, నెల్లూరు, కడప, అనంతపురం, కర్నూలు, వరంగల్ నుంచి విద్యార్థులు నీట్ వ్రాసేందుకు నగరానికి విచ్చేయడంతో సందడి నెలకొనింది. మొత్తం 5,297 మంది పరీక్షకు దరఖాస్తు చేసుకోగా 4,823 మంది హాజరైనారు. వివిధ జిల్లాల నుంచి, ముంబాయి వంటి నగరాల నుంచి వచ్చిన విద్యార్థులు, వారి వెంట వచ్చిన వారికి స్వచ్ఛంద సంస్థలు, వివిధ రాజకీయ పార్టీలు వసతి భోజన సౌకర్యం కల్పించాయి. స్వర్ణభారత్ ట్రస్టు, తెలుగుదేశం పార్టీ, సింహపురి ఫ్రెండ్స్ వెంకట్రామా అండ్‌కో నిర్వాహకుడు శ్రీనివాసరావు విద్యార్థులకు ఆహారాన్ని, మజ్జిగ, మంచినీటిని అందించారు. వీరితోపాటు ఆటో కార్మికులు, స్థానికులు పలువురు స్వచ్ఛందంగా ముందుకొచ్చి విద్యార్థులకు సహకారం అందించడం విశేషం. 'ఈనాడు' దిన పత్రిక ఈ వ్యవహారంలో దిక్సూచిగా పనిచేసింది. తొలిసారిగా జరిగిన ఈ పరీక్షకు ఊరుకాని ఊరు వచ్చిన విద్యార్థులు, వారి తల్లితండ్రులు నగరవాసులు చూపిన ఆదరాభిమానాలకు ఎంతో కృతజ్ఞతలు తెలిపారు.

## ప్రేమలో హన్సిక?



ముద్దుగుమ్మ హన్సిక ప్రేమలో పడిందా? చెన్నై సినీవర్గాల్లో ప్రస్తుతం ఈ ప్రేమాయణం గురించే ఆసక్తిగా చర్చించుకొంటున్నారు. ఇంతకీ హన్సిక ఎవర్ని ప్రేమిస్తోంది? తమిళ కథానాయకుడు శింబుతో హన్సిక ప్రేమలో ఉందని అంటున్నారు. వీళ్లిద్దరూ కలిసి 'వాలు' అనే చిత్రంలో నటిస్తున్నారు. ఆ సమయంలో మొదలైన పరిచయం కాస్తా ప్రేమగా మారిందని తమిళ సినీ వర్గాలంటున్నాయి. ఇప్పటికే కొన్ని తమిళ పత్రికల్లో వీటి గూర్చి కథనాలు వచ్చాయి. అయితే వీటిని హన్సిక త్రోసి పుచ్చింది. అందరు నటులతోనూ ఉండే స్నేహం, పరిచయాలే శింబుతోనూ ఉన్నాయని వాటికి వేరే అర్థాలు వెదకటం భావ్యం కాదనీ స్పష్టం చేసింది.

## రామ్ – లక్ష్మణ్ దర్శకత్వం!

డ్యాన్స్ మాస్టర్లు, రైటర్లు, మ్యూజిక్ డైరక్టర్లు, హీరోలు దర్శకత్వం వైపు అడుగులు వేస్తుంటారు. అడపాదడపా ఫైట్ మాస్టర్లు కూడా కెప్టెన్ బాధ్యతలు స్వీకరిస్తారు. గతంలో ఫైట్ మాస్టర్ విజయన్ కూడా కొన్ని చిత్రాల్ని రూపొందించాడు. ఆ పంథాలోనే వెళ్లబోతున్నారు రామ్ – లక్ష్మణ్ సోదరులు. గతంలో వీరిద్దరూ యాక్షన్ – నెం.1 అనే చిత్రంలో హీరోలుగా నటించారు. ఇటీవలే ఓ సినిమాలోనూ ముఖ్య పాత్రలు పోషించారు. ఈ స్టంట్ మాస్టర్లు దర్శకత్వం వహించేందుకు ఒక కథాంశాన్ని సిద్ధం చేసుకొన్నారు. దాన్ని హీరో వెంకటేష్‌కు వినిపిస్తే నచ్చిందన్నాడట. రామ్ – లక్ష్మణ్ దర్శకత్వంలో తయారయ్యే చిత్రం గూర్చి కొద్ది రోజుల్లో వివరాలు వెల్లడవుతాయి.



## తెలుగు తెరకు మోహన్‌లాల్!



మళయాళ సూపర్ స్టార్ మోహన్‌లాల్ త్వరలో తెలుగు సినిమాలో నటించబోతున్నారా? ఔననే అంటున్నాయి తెలుగు సినీ వర్గాలు. చాన్నాళ్ల క్రిందట ఆయన బాలకృష్ణ నటించిన గాండీవంలో తళుక్కున మెరిశారు. ఈ చిత్రంలోనే గోరువంక వాలగానే పాటలో అక్కినేని, బాలకృష్ణలతో కలిసి నర్తించారు. ఇప్పుడు కథలో ముఖ్యమైన పాత్రలో మోహన్‌లాల్ నటిస్తారని అంటున్నారు. సంతోష్ శ్రీనివాస్ దర్శకత్వంలో బెల్లం కొండ సురేష్ ఓ చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఎన్టీఆర్ హీరో. దీనిలో మోహన్‌లాల్ నటిస్తారు. పూర్తి వివరాలు తెలియను ఇంకొన్ని రోజులు వేచి చూడాలి.

## రెజీనాకు అవకాశాలు!



ఎస్.ఎం.ఎస్ సినిమాతో తెలుగు ప్రేక్షకులకు పరిచయమైంది హీరోయిన్ రెజీనా. ఆ తర్వాత రొటీన్ లవ్‌స్టోరీలోనూ కనిపించింది. ఓ వైపు నుంచి చూస్తే ఇలియానా, మరో వైపు నుంచి చూస్తే జెనీలియాలా కనిపించడం ఈ అమ్మడి ప్రత్యేకత. నటనలోనూ మంచి మార్కులే తెచ్చుకొంది. దాంతో టాలీవుడ్ దృష్టి ఈ అమ్మడిపై పడింది. వరుసగా అవకాశాలను అందుకోగలుగుతోంది. గీతా ఆర్ట్స్ నిర్మించే రెండు చిత్రాల్లోనూ రెజీనాను కథానాయికగా తీసుకొన్నారు. గౌరవం తర్వాత అల్లు శిరీష్ నటించే చిత్రంతోపాటు నారా రోహిత్ సరసన రెజీనా నటిస్తోంది. ప్రస్తుతం తెలుగులో మూడు చిత్రాలు రెజీనా చేతిలో ఉన్నాయి.

## మళ్లీ తరుణ్



శశిరేఖా పరిణయం తర్వాత తెరపై కనిపించ లేదు హీరో తరుణ్. ఆ తర్వాత మూడు చిత్రాలు ఒప్పుకొని నటించాడు. అవే చుక్కలాంటి అమ్మాయి చక్కనైన అబ్బాయి, అనుచరుడు, యుద్ధం. కానీ ఈ మూడు చిత్రాలు విడుదలకు నోచుకోలేదు. దీంతో తరుణ్ కెరీర్ నెమ్మదించింది. ఇతను అడపా దడపా సినీ తారల క్రికెట్‌లో మాత్రం మెరుస్తున్నాడు. త్వరలో మళ్లీ కెమెరా ముందుకు వచ్చేందుకు సన్నాహాలు చేసుకొంటున్నాడు. ఆయన నటించే చిత్రం పేరు గొడవెందుకు బంగారంగా నిర్ణయించారు. పూర్తి వివరాలు వెల్లడి కావాల్సి వుంది.



## వీకువీరుడు!

చిత్ర సమీక్ష

✍ అల్లూరు రహీం

తాను సినిమాల నుంచి సెలవు తీసుకోవడం ఎప్పటికీ జరగదని, నాగచైతన్య, అఖిల్ సినిమాల నుంచి రిటైర్ అయినా తాను మాత్రం నటిస్తూనే వుంటానని; ఫీల్డ్‌లో ఎప్పటికీ 'కింగ్'నేనని హీరో నాగార్జున గ్రీకువీరుడు చిత్రం ఆడియో రిలీజ్ ఫంక్షన్‌లో ప్రకటించాడు. కానీ ఆయనకు అంత సీన్‌లేదని కామాక్షి మూవీస్ పతాకంపై నెల్లూరీయుడు డి.ప్రసాద్‌రెడ్డి నిర్మించిన గ్రీకువీరుడు చిత్రం నిరూపించింది. దర్శకుడు కె.దశరథ్ కుటుంబ బంధాలు కలగలిపి చిత్రాలు తీయడంలో మంచి నేర్పరి. పదేళ్ల క్రితం ఆయన నాగార్జునతో 'సంతోషం' చిత్రం తీశారు. ఈ మధ్య మిస్టర్ పర్‌ఫెక్ట్ వంటి హిట్ చిత్రం కూడా ఆయన ఖాతాలో వుంది. కానీ 53 ఏళ్ల నాగార్జునను కాస్త స్టయిల్ మార్చి రిలేషన్స్ పెంచుకొంటూపోతే నొప్పి పెరుగుతుందన్న కాన్సెప్ట్‌తో ఆయన తీసిన గ్రీకువీరుడు చిత్రం గొప్పగా లేదు. అసలు పేరుకు ఈ చిత్రానికి సంబంధం కూడా లేదు. దర్శకుడు అనుకొన్నట్లుగా భావోద్వేగం, వినోదం ఈ చిత్రంలో బ్యాలెన్స్‌గా కుదరలేదు. దశరథ్ పాత చిత్రాలనే మళ్లీ చూసినట్లుంది. ప్రథమార్థంలో కాస్త చకచకా నడిపిన స్క్రీన్‌ప్లే ద్వితీయార్థంలో మరీ నీరసమయ్యి చిత్రం చూస్తున్న ప్రేక్షకుల సహనాన్ని పరీక్షిస్తుంది. గ్రీకువీరుడులో గొప్పగా చెప్పుకోవాల్సింది అమెరికా దేశ అందాలు. అక్కడి అడ్వెంచర్ ల్యాండ్‌లో సాహస ఘట్టాలు, స్టాచ్యు ఆఫ్ లిబర్టీ, మంచుకొండల్లో మేఘాలు తరలి వచ్చి ముద్దాడడం, నాసా కేంద్రంలో భార రహిత స్థితిలో హీరో బృందం తేలియాడే సన్నివేశాలు. వీటన్నింటినీ కెమెరామెన్ అనిల్ బండారి అద్భుతంగా చిత్రీకరించాడు. సంగీత దర్శకుడు థమన్ తనదైన ధోరణికి భిన్నంగా పాటల్లో చరణాలు అర్థమయ్యేలా ఓనాడు వాషింగ్‌టన్‌లో, ఎవ్వరూ లేరని, విన్నది నిజమేనా, ఓసి నా బంగారం పాటలకు సంగీతం కూర్చాడు. తొలిపాట 'రమ్మన' చరణంతో సాగేది అర్థం కాకపోయినా నాగార్జున కాస్త కష్టపడి డ్యాన్స్ చేశాడు. నే విన్నది నిజమేనా పాటలో నాగార్జున ఇచ్చిన హిప్ మూమెంట్ వికారంగా ఉంది. దశరథ్, గోపిమోహన్, కోన వెంకట్, ప్రవీణ్ వర్మలలో ఎవరు వ్రాశారో మనకు తెలియదు కానీ ఇగోయిస్ట్ టెర్రరిస్ట్‌కన్నా డేంజర్, ప్రేమతో చేస్తే ఏదైనా పాసిబుల్, మగాడు దృష్టి మనీ మీద... ఆడవాళ్లు దృష్టి అందం మీద పెట్టాలి. ప్రేమున్న చోట పెయిన్ ఉంటుంది. అమ్మాయిలంటే ఆనందం డైలాగులు ఆలోచింపజేస్తాయి. చాలా రోజులకు తెరపై కనపడ్డ శరత్‌బాబు పాత్ర పరిధి మరీ ఘోరంగా ఉండడం సినిమా చూసే వారిని బాధపెడుతుంది. బ్రహ్మానందం – నయనతారలను సలీమ్ అనార్కలిలా చూపడం ఎబ్బెట్టుగా వుంది. సినిమాలోని ఓ సన్నివేశంలో రూమ్‌లో కట్టిన కుక్కలు పరిశ్రమలో హీరోల్లా మాట్లాడడం వాళ్లను కిండల్ చేసినట్లే. ఈ సన్నివేశం అనవసరమే.

చిత్రకథలోనికి వెళ్తే అమెరికాలో ఈవెంట్ మేనేజర్‌గా ఉండే చందు(నాగార్జున), ఆశిష్ విద్యార్థికి సంబంధించిన ఒక ఈవెంట్‌ను ఘోరంగా నిర్వహిస్తాడు. ఇదేమిటనడిగితే అతనితో ఆషామాషీగా మాట్లాడుతాడు. కోర్టుకు వెళ్తానంటే కోర్టులను, న్యాయమూర్తులను నీచంగా నిందిస్తాడు. ఈ వ్యవహారాలు రుజువు కావడంతో ఐదు మిలియన్ డాలర్ల నష్టపరిహారం చెల్లించమని అమెరికన్ న్యాయస్థానం తీర్పునిస్తుంది. చందు నిలకడలేని మనిషి. రిలేషన్స్ నడిపితే ఇబ్బందులని 99 మంది ఆడపిల్లలను వాడుకొని వదిలేస్తాడు. వారిలో ఒకామె హనీ(మీరా చోప్రా) అనుకోని పరిస్థితుల్లో డాక్టర్ కామరాజు(బ్రహ్మానందం)ను పెళ్లి చేసుకొని చందుపై పగ సాధించాలని పథకాలు వేస్తుంటుంది. చందుకు ఇండియాలో తాతయ్య (కె.విశ్వనాథ్) ఆయనతోపాటు పెద్ద కుటుంబం వుంటుంది. అతను ఇండియా వచ్చి సంతకం పెట్టి వెళ్తే చందు వాటాగా కోట్లాది రూపాయలు వస్తాయని లాయర్ ఫోన్ చేస్తాడు. ఐదు మిలియన్ డాలర్ల పరిహారానికి సర్దుబాటు చేసే ఉద్దేశంతో ఇండియా బయలుదేరే చందుకు ఎయిర్ పోర్టులో పరులకోసం పరితపించే ఓ స్వచ్ఛంద సేవా సంస్థలో పనిచేసే సంధ్య(నయనతార) పరిచయమవుతుంది. కాస్త కెమిస్ట్రీ జరిగాక ఆడవాళ్లను ద్వేషించే చందు సంధ్య పట్ల ఆకర్షితుడవుతాడు. తాతయ్య ఇంటికి రాగానే తనను అభిమానించే అత్తలు, మామయ్యలతో అతనిలో ఆత్మీయ అనుబంధాలు అంకురిస్తాయి. సంధ్య ఫోటోలు చూసి ఆమె ఎవరంటే భార్య అంటాడు. ఒక రోజు ఆమె అక్కడకు వస్తుంది. ఫ్యామిలీ కోసం కాస్త నటించమంటే ఆమె చందుతో తాళి సైతం కట్టించుకొంటుంది. ఆ తర్వాత కథ పలు మలుపుల మధ్య చివరకు సుఖాంతమవుతుంది.

# ఏసిబి వేట!

## అవినీతిపరులపై కెమెరాలతో నిఘా

అవినీతిపరుల గుండెల్లో దడ పుట్టిస్తున్న అవినీతి నిరోధక శాఖ (ఏసిబి) అధికారులు కొత్త కొత్త మార్గాలను అన్వేషిస్తున్నారు. వివిధ శాఖల నుంచి లంచగొండులైన ఉద్యోగులపై వస్తున్న ఫిర్యాదులపై పకడ్బందీగా వ్యవహరిస్తూ రెడ్‌హ్యాండెడ్‌గా పట్టుకొంటూ కోర్టుల ముందు నిలబెడుతున్నారు. అయితే లంచాలు తినమరిగిన ఉద్యోగులు ఏసిబికి దొరికినా తిరిగి తమ అలవాట్లు మానుకోవడం లేదు. ఆయా శాఖలలో దాడులు జరిగిన సమయంలో మాత్రం గప్‌చుప్‌గా వుంటూ ప్రక్కరోజు నుంచి తిరిగి తమ దందా మొదలు పెడుతున్న సంగతి తెలిసిందే. ఏసిబి అధికారులు దాడులుచేసి అవినీతిపరులను పట్టుకోవడమేకాక ఆ తర్వాత వారి కదలికలపై నిఘా పెడుతూ కొత్త పంధాకు శ్రీకారం చుట్టారు. ఏప్రెల్ నెలలో రవాణాశాఖ కార్యాలయంపై, మునిసిపల్ కార్యాలయంపై దాడులు చేసింది ఏసిబి. రవాణాశాఖలో కొందరు దళారులను అదుపులోకి తీసుకొన్నారు. విచారించి వదలి పెట్టారు. తిరిగి ఆర్‌టిఏ కార్యాలయంలో దళారులు కన్పిస్తూనే వున్నారు. దీనిపై స్పందించిన ఏసిబి దాడులు చేసిన తర్వాత ఆయా కార్యాలయాలపై కన్నేసి వుంచేందుకు ప్రణాళిక రచించారు. ఇందులో భాగంగా ఏసిబి కానిస్టేబుళ్లను మఫ్టీలో రవాణాశాఖ, మునిసిపాలిటీల్లో ఉంచి అక్కడ జరిగే దళారుల కార్యకలాపాలను వీడియో కెమెరాలో చిత్రీకరిస్తున్నారు ఏసిబి డిఎస్పీ భాస్కర్ రావు. ఈ చర్యలతో అక్కడి దళారులు భయభ్రాంతులకులోనై ఎక్కడ కాగితాలు అక్కడే పడేసి పరుగులు పెట్టారు. డిఎస్పీ తీసుకున్న ఈ నిర్ణయంపై పలు వర్గాల నుంచి హర్షం వ్యక్తమౌతోంది. దాడి చేయడమేకాక తదనంతర పరిస్థితులపై నిఘాపెట్టి మన్ననలందుకొంటున్నాడు భాస్కర్‌రావు.

# నెల్లూరు చెరువును ఆక్రమిస్తున్న బర్నాబాసు!



చెరువును రబ్బిష్‌తో పూడ్చేస్తున్న దృశ్యం.

అధికారులు, పాలకుల ఉదాసీనవైఖరి కారణంగా ప్రభుత్వ ఖాళీ స్థలాలు దురాక్రమణకు గురవుతున్నాయి. ఆక్రమణ దారులకు రాజకీయ పలుకుబడి వుంటే చాలు ఆ వైపు అధికారులు కన్నెత్తి చూడని పరిస్థితి. ఇప్పటికే అనేక మండలాల్లో రెవిన్యూ, పంచాయితీ, నీటిపారుదల శాఖలకు చెందిన స్థలాలు కబ్జా చేశారు. వుండేందుకు నివాసంలేని సామాన్య ప్రజలు ప్రభుత్వ ఖాళీ స్థలాల్లో చిన్న గుడిసెలు ఏర్పాటు చేసుకుంటే ఆఘమేఘాలపైన వెళ్లి వాటిని తొలగిస్తారు. అదే రాజకీయ పలుకుబడి కలిగిన వ్యక్తులు స్థలాలను ఆక్రమించారని ఫిర్యాదుచేసినా పట్టించుకునే దిక్కుండదు. అధికారులు నిర్లక్ష్యంగా వ్యవహరించడం వల్ల కోట్ల రూపాయలు విలువచేసే స్థలాలు ఆక్రమించి విక్రయించుకుంటున్నారు. ఇందుకు ఉదాహరణగా నెల్లూరు నగరానికి అతి సమీపంలో వున్న చెరువును పేర్కొనవచ్చు. ఇప్పటికే పొదలకూరు రోడ్డు వెంగళరావునగర్ సమీపంలో కొంత భాగం చెరువును ఆక్రమించి ఇళ్ల ప్లాట్లను ఏర్పాటుచేసి విక్రయాలు జరిపారు. తాజాగా పొదలకూరురోడ్డు లేక్‌వ్యూ కాలనీ పడమర వైపు వున్న చెరువును ఆక్రమించే ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఇక్కడ కొంతమేర ఆక్రమించి ట్రాక్టర్లతో మట్టి తరలించి చెరువును పూడుస్తున్నారు. ఈ ప్రాంతానికి చెందిన మాజీ కార్పొరేటర్ భర్త బర్నాబాసు ప్రమేయంతోనే చెరువులో ఇళ్ల ప్లాట్లను ఏర్పాటు చేసేందుకు కొందరు రాజకీయ ప్రయత్నాలు ప్రారంభించారు. ట్రాక్టర్లతో మట్టి తీసుకుని అతివేగంగా తిరుగుతుండడంతో స్థానికులు భయాందోళన చెందుతున్నారు. అధికార పార్టీ సహకారం వున్న మాజీ కార్పొరేటర్ భర్త బర్నాబాసును ప్రశ్నించే ధైర్యం చేయలేకపోతున్నట్లు సమాచారం. ఇప్పటికైనా రెవిన్యూ, నీటి పారుదల శాఖ అధికారులు స్పందించి చెరువు దురాక్రమణకు గురి కాకుండా అన్ని చర్యలు తీసుకోవాల్సిన అవసరం వుంది.

## ● ఆకట్టుకొంటున్న

# భారత్ ట్రేడ్ ఫెయిర్ ఎగ్జిబిషన్!



ఎగ్జిబిషన్ ముఖ ద్వారం.

వేసవి సాయంకాలాల్లో సేద తీరాలనుకొనేవారికి వైఎంసిఏ గ్రౌండ్స్‌లో ఏర్పాటుచేసిన భారత్ ట్రేడ్ ఫెయిర్ ఎగ్జిబిషన్ చక్కని వేదికగా ఉంది. కుటుంబం మొత్తం ఆనందం పొందేలా ఈ ఎగ్జిబిషన్‌ను తీర్చిదిద్దారు. ఎగ్జిబిషన్‌లోని ఎమ్యూజ్‌మెంట్ పార్కులో డెవిల్ హౌస్ పిల్లలను విపరీతంగా ఆకర్షిస్తుంది. దేశంలోని వివిధ రాష్ట్రాలలో తయారైన బొమ్మలు, క్రోకరీ, ప్లాస్టిక్ వస్తువులు సరసమైన ధరలకే లభిస్తున్నాయి. సరికొత్త డిజైన్లలో గృహోపకరణాలు ఆకట్టుకొంటున్నాయి. రెడిమేడ్ గార్మెంట్స్, గిఫ్ట్ ఆర్టికల్స్ ప్రత్యేకత చాటుకొంటున్నాయి. వినోదం కోసం జెయింట్‌వీల్, కొలంబస్, క్రాస్‌వీల్, సలంబో, బ్రేక్‌డ్యాన్స్, మినీ ట్రైన్, టోరాటోరాలతోపాటు ఆసక్తిని రేపే ఎన్నో అంశాలున్నాయి. తక్కువ ఖర్చుతో ఎక్కువ వినోదం పొందాలని ఎగ్జిబిషన్ ఏర్పాటు చేశామని నిర్వాహకుడు బాబు తెలిపారు.

# డిఇఓ బదలీకి మంత్రి అడ్డు చక్రం!



జిల్లా విద్యాశాఖాధికారి మువ్వా రామలింగం బదలీకి ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి అడ్డు చక్రం వేశారు. దీంతో చివరి నిముషంలో డిఇఓ బదలీ నిలచిపోయింది. నెల్లూరు డిఇఓతోపాటు ఖమ్మం డిఇఓపై ఫిర్యాదులు వెల్లువెత్తడంతో ప్రిన్సిపాల్ సెక్రటరీ వీరిద్దరినీ అక్కడ నుంచి బదలీ చేయమని ఆదేశాలు జారీచేశాడు. దీనికి అనుగుణంగా అధికారులు ఖమ్మం డిఇఓను మార్చగా, నెల్లూరు డిఇఓ రామలింగం బదలీ జరగకుండా మంత్రి ఆనం అడ్డుపడ్డాడు. ఈ వ్యవహారం విద్యారంగంలో చర్చనీయాంశమైంది. రామలింగం జిల్లాకు రావడానికి ఆనం ఆశీస్సులు పుష్కలంగా వున్నాయి. గతంలో ఆనం వివేకానందరెడ్డితో పొసగకపోయినా వాటిని సర్దుబాటు చేసుకుని పాహిమాం అంటూ కాళ్లపై పడడంతో ఆయన్ను జిల్లాకు తెచ్చుకొన్నారు. ప్రభుత్వం తాజాగా ఉపాధ్యాయుల బదలీలకు గ్రీన్‌సిగ్నల్ ఇవ్వడంతో ఎవరిని ఎక్కడకు మార్చాలనే దానిపై హైదరాబాద్‌లో అనారోగ్యం కారణంగా విశ్రాంతి తీసుకొంటున్న రూరల్ శాసనసభ్యుడు ఆనం వివేకానందరెడ్డి దగ్గరకెళ్లి ఆయన చెప్పిన వారిని బుజబుజనెల్లూరు, కృషినగర్, వావిలేటిపాడు, నవలాకులతోట తదితర ప్రాంతాల్లోని పాఠశాలలకు బదలీ చేసేందుకు సిద్ధమయ్యాడు డిఇఓ. అయితే చివరి నిమిషంలో ప్రభుత్వం గవర్నమెంటు ఆర్డర్(జీవో)లను రద్దు చేయడంతో ఈ బదలీలు నిలిచిపోయాయి. ఈ వ్యవహారంలో మూలాపేటలోగల ఒక స్కూల్ కరస్పాండెంట్, ఎమ్మెల్యే సోదరుడు కీలకపాత్ర పోషించారట. ప్రభుత్వ నిర్ణయంతో దీనికి అడ్డుకట్ట పడింది. మరోవైపు ఆనంతో సన్నిహితంగా వుండే ఆత్మకూరులోని పలువురు ఉపాధ్యాయులు, అనుచరులు ఫిర్యాదుచేసినా మంత్రి పట్టించుకోలేదు.

# స్టేడియంలో పిల్లలకు పౌష్టికాహారం పంపిణీ!

## ఈ నెలంతా కొనసాగే కార్యక్రమమిది

ఏసి సుబ్బారెడ్డి స్టేడియం వాకర్స్ అసోసియేషన్ నేతృత్వంలో వేసవి శిబిరాన్ని పురస్కరించుకొని 600 మందికి ఉడికించిన కోడిగ్రుడ్లు, కేకుల పంపిణీ కార్యక్రమం జరిగింది. దీన్ని అదనపు జాయింట్ కలెక్టర్ చల్లా పెంచలరెడ్డి ప్రారంభించారు. ఈ సందర్భంగా వాకర్స్ అసోసియేషన్ అధ్యక్షుడు రాఘవేంద్రషెట్టి మాట్లాడుతూ వేసవి సెలవుల్లో క్రీడా శిక్షణ నిమిత్తం స్టేడియంకు వచ్చే చిన్నారులకు వాకర్స్ సహకారంతో ఈ పౌష్టికాహారాన్ని మే 31వ తేది వరకు రోజూ అందిస్తామన్నారు. తొలి రోజు ఈ కార్యక్రమ నిర్వహణకు బి.సుందరరామిరెడ్డి, ఎ.రామచంద్రారెడ్డి ఆర్థిక సహాయం అందించారు. ఈ కార్యక్రమంలో డిఎస్‌డిఓ ఎతిరాజ్, రూరల్ డిఎస్పీ బాల వెంకటేశ్వరరావు, వాకర్స్ అసోసియేషన్ కార్యదర్శి ఎన్.బలరామయ్య నాయుడు, కోశాధికారి స్వర్ణ రమేష్‌బాబు పాల్గొన్నారు.

## అసమ్మతి రాగాలు

మొదటి పేజీ కొరవ

ప్రభుత్వాల విషయంలో వైఎస్ రాజశేఖర్‌రెడ్డి అనుసరించిన అసమ్మతి రాజకీయాల పోకడను కాపీ కొడితే చాలు అన్నది డిఎల్ రవీంద్రరెడ్డి ప్రతిపాదన. బొత్సా మాట వినే ఎమ్మెల్యేల సంఖ్య 20 మంది వరకు వుంటుందని అంచనా. ప్రభుత్వాన్ని ఉడకాడించడానికి ఆ బలం చాలు. ఈ మాత్రం సంఖ్యా బలం చూపిస్తే ఢిల్లీ పెద్దలు తమ మాట వింటారని అంచనా వేస్తున్నారు వీరు.

అయితే తమ అసమ్మతి వల్ల కిరణ్ గద్దె దిగదన్న నిజం వీరికి బాగా తెలుసు. ఎన్నికలకు ఏడాది కూడా లేని సమయంలో ముఖ్యమంత్రి మార్పు ప్రతిపాదన తలపెట్టే తెలివి తక్కువ పని కేంద్రం చేయదని పసి పిల్లవాడిని అడిగినా చెప్తాడు. అయితే ఈ పది నెలల కాలం కిరణ్‌ను కంటి మీద కునుకు లేకుండా చేస్తే, కనీసం తమ జోలికి రాకుండా వుంటాడని వీరి ఆశ. బొత్సా పదవికి చాన్నాళ్ల నుంచి ఎసరు పెట్టి వున్నాడు కిరణ్. ఒకే వ్యక్తికి రెండు పదవులు ఉండకూడదన్న సూత్రం ఆధారంగా పిసిసి వుంది కాబట్టి మంత్రిత్వం ఊడబెరుకుతానని చెప్తున్నాడు. ఆనం రామనారాయణరెడ్డి సమస్య – మంత్రి వర్గ విస్తరణ అంటూ జరిగితే తన ఆర్థిక శాఖ ఊడుతుందన్న భయం. ఆ శాఖ ఉన్నందువల్ల మంత్రివర్గంలో తాను నంబర్ టు అని భ్రమింపచేసి పనులు చక్కబెట్టుకొంటున్నాడాయన. రామనారాయణరెడ్డి తనకంటే పొడుగు వాడనే మాట ప్రచారం కావడం కిరణ్‌కు ఇష్టం లేదు. ఇక డిఎల్ సంగతి చెప్పనే అవసరం లేదు. ఆరోగ్య శాఖతో చాలా అసంతృప్తిగా ఉన్నాడాయన. విద్యుత్, రెవిన్యూ వంటి కీలక శాఖలు కావాలని కోరిక. ముఖ్యమంత్రి కుర్చీ క్రిందకు నీళ్లు తెస్తున్నది తానే అని తెలిస్తే తనను మచ్చిక చేసుకోవడానికి ఏదో ఒక తాయిలం ఇవ్వకపోతాడా అన్నది డిఎల్ ఆంతర్యం.

మొత్తంమీద ఎవరి కోరికలతో వారు రాష్ట్ర కాంగ్రెస్‌లో చాలా కాలం తర్వాత అసమ్మతి రాజకీయాలు తెరమీదకు తెచ్చారు. అయితే బొగ్గు కుంభకోణంలో గొంతులోతు వరకు కూరుకపోయి, పార్లమెంట్ ఏ క్షణంలో రద్దు అవుతుందో అన్న ఆందోళనలో వున్న కేంద్ర నాయకులు ఈ రాష్ట్రం గోల విన్పించుకొంటారా అన్నది సందేహం.



గడప గడపకు వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ కార్యక్రమంలో భాగంగా నెల్లూరు యలమలవారిదిన్నెలో ప్రజల సమస్యలు అడిగి తెలుసుకొంటున్న పోలుబోయిన అనిల్‌కుమార్ యాదవ్.

## కాంగ్రెస్‌కు ఉపశమనం

మొదటి పేజీ కొరవ

కానీ కుర్చీ మీద మమకారంతో చేయరాని తప్పులు చేశాడు. పదవిలో వుండగానే జైలుకు వెళ్లిన ఏకైక ముఖ్యమంత్రిగా చరిత్రకెక్కాడు. అంతటితో ఆగకుండా జైలుకు వెళ్లినా పెత్తనం నాకే వుండాలని మంకు పట్టు పట్టి, తాను పెంచిన చెట్టును తానే నిలువునా నరికి పారేశాడు. గత మూడేళ్లుగా కర్నాటకలో ప్రభుత్వాన్ని నడపలేని పరిస్థితి కల్పించాడు. ఎన్నికలొచ్చేసరికి, బిజెపి మీద మంటతో స్వంత కుంపటి పెట్టాడు. ఆ కుంపటి ఆయనకు అధికారం మీద క్రమ్ముకొన్న చీకట్లను పారద్రోలలేకపోయింది కానీ, బిజెపి ప్రాభవాన్ని మాత్రం తగలబెట్టింది. యడ్యూరప్ప పార్టీకి దాదాపు 10 శాతం ఓట్లు వచ్చాయి. మరొక జైలు పక్షి గాలి జనార్దనరెడ్డి పార్టీకి కూడా రెండుశాతం వరకు ఓట్లు వచ్చాయి. ఇవి రెండూ కలిసి బిజెపికి మొత్తం మీద 11శాతం వరకు ఓట్లు తగ్గాయి. దానితో వారు పరాజయ ప్రాభవం ఎదుర్కోక తప్పలేదు.

కాంగ్రెస్‌కు 122 స్థానాలొచ్చినా, గత ఎన్నికలతో పోలిస్తే వచ్చిన ఓట్లు కేవలం రెండు శాతం లోపు మాత్రమే అధికం. అంత తక్కువ తేడాతో ప్రతిపక్షం నుంచి పాలకపక్షానికి ఎగబ్రాకారు వారు. ఓట్ల శాతం తక్కువ ఎక్కువా అన్నది ముఖ్యం కాదు. అధికారం దక్కిందా లేదా అన్నదే ముఖ్యం.

ఈ ఎన్నికలలో చాలా ప్రాధాన్య అంశాలున్నాయి. ఇంతకాలం ఐరన్ లెగ్ అన్న నింద అనుభవిస్తున్న రాహుల్‌గాంధీకి కొంత ఉపశమనం. ఆయన ప్రచారం చేసిన చోట కాంగ్రెస్ గెలవడం అన్నది ఇక్కడొక్కదగ్గరే సాధ్యమైంది. దేశమంతా ప్రజల నోట నరేంద్రమోడి మంత్ర జపం విన్పిస్తున్నదని గప్పాలు కొట్టుకొంటున్న బిజెపికి దిమ్మతిరిగింది. నరేంద్ర మోడి ప్రచారం చేసిన నియోజకవర్గాలలో కూడా ఆ పార్టీ గెలవలేదు. దేవగౌడకు చెందిన జనతాదళ్(ఎస్) బిజెపితో సమానంగా సీట్లు తెచ్చుకోవడం కేంద్రంలో మూడవ ఫ్రంట్ ఆశల ఊయల మీద వూగుతున్న ములాయంసింగ్ బృందానికి చల్లని వార్త. దేవగౌడ ఎన్నో కొన్ని సీట్లు తెచ్చి ఇస్తాడన్న నమ్మకం కలుగుతున్నది వారికి.

కర్నాటక ఎన్నికలపై మన రాష్ట్రంలో ఎవరికి తోచిన ప్రచారం వారు చేసుకొంటున్నారు. అధికార పక్షం ఓడింది కాబట్టి, ఇక్కడా రేపటి ఎన్నికలలో కాంగ్రెస్ ఓడుతుందని తెలుగుదేశం జోస్యం చెప్తున్నది. కానీ అక్కడ బిజెపి ఓటమికి అవినీతి కారణం కాబట్టి, ఇక్కడ కూడా జగన్ పార్టీకి జనం ఓట్లు వేయరని కాంగ్రెస్ నేతలు గొంతెత్తి అరుస్తున్నారు. జగన్ పార్టీ మాత్రం ఈ ఫలితాలు మాకు అనుకూలం అని మరొకప్రక్క ప్రకటిస్తున్నది. వారి వాదన – ప్రజలు పూటకొక ముఖ్యమంత్రిని మార్చే అస్థిరత్వాన్ని అంగీకరించలేదన్నది. గాలి జనార్దనరెడ్డి పార్టీకి పట్టిన గతే వైఎస్ జగన్‌కూ పడుతుందని తెలుగుదేశం గేలి చేస్తున్నది. కానీ గాలి పరిస్థితి వేరు, తన పరిస్థితి వేరు అని జగన్ బృందం సమర్ధించుకొంటున్నది. గాలిది కేవలం బిజెపి మీద ఆగ్రహం. కానీ ఇక్కడ వైఎస్ మరణం మీద ప్రజలలో వున్న సానుభూతి పవనాలే తమ పడవను క్షేమంగా ఒడ్డుకు చేరుస్తాయని జగన్ ఆశ.

మొత్తం మీద కర్నాటక ఎన్నికల ఫలితాలు దేశవ్యాప్తంగా రాజకీయ చర్చలకు, మార్పులకు, ఆశలకు, నిరాశలకు ప్రాణం పోశాయి.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

ఎఎంసి ఛైర్మన్ చెన్ను బాలకృష్ణారెడ్డి నేతృత్వంలో ప్రజలు రెవిన్యూ మంత్రి ధర్మాన ప్రసాద్‌రావు, ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డిలకు ఫ్యాక్స్ సందేశాలు పంపారు. బ్రిటీష్ కాలం నుంచి రాపూరు మండలం నెల్లూరు డివిజన్‌లోనే ఉందని ఇప్పుడు తమ మండలాన్ని గూడూరుకు మారిస్తే ఇబ్బందులు పడతామని పేర్కొన్నారు. గూడూరుకు పోవడం కన్నా నెల్లూరుకు రావడం తమకు సౌకర్యంగా వుంటుందని ప్రజలు మంత్రులకు పంపిన సందేశంలో నెల్లూరుకు రావడం తమకు సౌకర్యంగా ఉంటుందని స్పష్టం చేశారు.

## జేసీస్‌చే టిఫిన్ బాక్సుల పంపిణీ!

మేడేను పురస్కరించుకొని నెల్లూరు పరమేశ్వరి ఎవెన్యూలోని ఇళ్లలో పనిచేసే కార్మికులకు నెల్లూరు జేసీస్ సంస్థ సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి చేతులమీదుగా టిఫిన్ బాక్సులు పంపిణీ చేసింది. ఈ కార్యక్రమంలో జేసీస్ అధ్యక్షుడు తవ్వా శ్రీనివాసులు, వరప్రసాద్, సునందన్, సుమన్, మధుబాబు, కె.సురేష్ పాల్గొన్నారు.

## ఆంజనేయరెడ్డికి రాష్ట్ర పదవి

బిజెపిలో పోరాట పటిమ, చక్కని వాక్చాతుర్యం కల్గిన నేత కర్నాటి ఆంజనేయరెడ్డికి రాష్ట్ర పదవి లభించింది. జిల్లా అధ్యక్షుడిగా పనిచేసిన ఆయనను రాష్ట్ర అధికార ప్రతినిధిగా నియమించారు. బిజెపి రాష్ట్ర అధ్యక్షుడు కిషన్‌రెడ్డి ఈ పదవికి ఎంపిక చేశారు ఆంజనేయరెడ్డిని. ఆయనకు కుదుమిచ్చినా పండుగే. తనకు లభించిన ఈ పదవితో మరింతగా రాణించాలని కోరుకొంటున్నాము.

## కావలి ఎస్ఐపై ఎస్పీ ఫైర్!

కావలి పట్టణ ఎస్ఐ వీరేంద్రబాబు వ్యవహార శైలిపై ఎస్పీ రమణకుమార్ ఆగ్రహం వ్యక్తం చేశారు. గత కొంతకాలంగా వీరేంద్రబాబుపై పలు ఫిర్యాదులు వస్తున్నాయి. ఇటీవల ఒకరిని ఇల్లు ఖాళీ చేయించే విషయమై బెదిరిస్తున్నారంటూ బాధితులు ఎస్పీకి ఫిర్యాదు చేయడంతో స్పందించిన ఎస్పీ కావలి డిఎస్పీ ఇందిరకు క్లాస్ తీసుకొన్నారు. ఎస్ఐపై విచారణ జరపండి, పద్ధతి మార్చుకోకపోతే వేటు తప్పదని హెచ్చరించారు.

## ఇందుకూరుపేటకు కాణిపాక ప్రచార రథం

కాణిపాక వరసిద్ధి వినాయకస్వామి దేవస్థానం వారి ప్రచార రథం ఇందుకూరుపేటకు చేరుకొంది. పెద్దచెరుకూరు మీదుగా ఇక్కడకు వచ్చిన ఈ రథానికి స్థానిక శ్రీమల్లేశ్వరస్వామి దేవాలయ ప్రాంగణంలో పాలక మండలి స్వాగతం పలికింది. ఈ సందర్భంగా స్వామి వారికి మహాగణపతి హోమం, మహా నివేదన, ప్రసాద వితరణ, సుప్రభాత కార్యక్రమాలను ఆలయ మర్యాదలతో నిర్వహించారు. అనంతరం ప్రచార రథం గొలగమూడికి బయలుదేరి వెళ్లింది.

## కోదండరామునికి విముక్తి

గత ఏడేళ్లుగా ధూపదీప నైవేద్యాలకు నోచుకోని రామయ్యకు అధికారుల చొరవతో విముక్తి లభించిన వైనం ఆత్మకూరు మండలం పెద్దబ్బీపురంలో చోటుచేసుకొంది. అక్కడగల కోదండరామస్వామి ఆలయం నిర్వహణ విషయంలో తలెత్తిన వివాదాలతో గుడికి తాళం వేశారు. ఇన్నేళ్లు దేవుడిని పూజించకుండా చీకట్లో పెట్టి తాళం వేస్తే అరిష్టమని కొందరు గ్రామస్తులు కలెక్టర్ శ్రీధర్‌ను కలసి విన్నవించారు. ఆయన ఆదేశాలపై ఆర్డీఓ మాధవీలత, డిఎస్పీ మహేంద్రనాయక్, దేవాదాయ అధికారి రవీంద్రరెడ్డి గ్రామస్తులతో చర్చించి గుడి తలుపులు తెరిపించారు. త్వరలో విగ్రహాలను పునః ప్రతిష్టిస్తామని అంతవరకు సీతారాముల చిత్రపటాన్ని ఏర్పాటు చేస్తున్నట్లు అధికారులు ప్రకటించడంతో కోదండరామునికి విముక్తి లభించింది.

## చెంచుమహాలక్ష్మి వసంతోత్సవాలు!

నెల్లూరు పెన్నానది పొర్లుకట్ట ప్రాంతంలో వెలసిన మహాశక్తి చెంచు మహాలక్ష్మి అమ్మవారి వసంతోత్సవాలు 17తేదీ జరగనున్నాయి. ఆరోజు అమ్మవారికి నలుగు, పంచామృత అభిషేకాలు, పొంగళ్లు, భక్తులకు సహపంక్తి భోజనం, పల్లకీసేవ, అఖండ దీపారాధన కార్యక్రమాలు జరుగుతాయి. గంగ సాంగ్యము, అమ్మవారి మాలధారణ కార్యక్రమాలు కూడా జరుగుతున్నందున భక్తులు ఈ కార్యక్రమంలో పాల్గొని అమ్మవారి కృపాకటాక్షాలు పొందాలని నిర్వాహకులు కోరుతున్నారు.

## జనవాణి

2వ పేజీ కొరవ

### డబ్బింగ్ సీరియళ్లు బాగుంటాయి!

డబ్బింగ్ సీరియళ్లు ఆపాలని మా – టీవీ స్టూడియో మీద దుండగులు దాడి చేయడం బాధగా వుంది. టీవీ ఛానళ్ల డబ్బింగ్ సీరియళ్లు ప్రసారం చేయకూడదంటే ఎట్లా? తెలుగులో ముందు డబ్బింగ్ సినిమాలు విడుదల కాకుండా చూడాలి. ఆ పనిని తెలుగు సినిమా పరిశ్రమలో ఉన్న పెద్దలు చేయలేరు. వాస్తవానికి తెలుగు టీవీ సీరియళ్లు సాగదీత మీద నడుస్తుంటాయి. సృజనాత్మకత ఉండదు. అటువంటి తెలుగు సీరియళ్లు ఎందుకు చూడాలి. డబ్బింగ్ సీరియళ్లు బాగుంటాయి. వీటిని ప్రసారం చేయమని మా – టీవీ యాజమాన్యాన్ని కోరుతున్నాను.

సి.సుజాత, బుచ్చిరెడ్డిపాళెం

## పదరంగం -66

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | ■ | 3 | ■ | 4 | | 5 |
| | ■ | | ■ | 6 | | | ■ | ■ | |
| 7 | | | ■ | ■ | | ■ | 8 | 9 | |
| | ■ | ■ | 10 | | | ■ | 11 | | ■ |
| ■ | 12 | | | ■ | 13 | 14 | | ■ | 15 |
| 16 | | ■ | 17 | 18 | ■ | | ■ | 19 | 20 |
| 20 | | ■ | ■ | 21 | | ■ | 22 | | ■ |
| ■ | ■ | 23 | 24 | | ■ | 25 | | | ■ |
| 26 | | ■ | | ■ | 27 | | | ■ | 28 |
| | ■ | 29 | | | ■ | | ■ | 30 | |

**అడ్డం**

1. కర్పూర హారతి (4)
4. మెట్టు (3)
6. ముక్కుపొడి (3)
7. గిరి రాజకుమార్తె (3)
8. తెలివి తేటలు (3)
10. నీటి ఊట (3)
11. తోక తెగిన మారుతి (2)
12. చెరువు, సరస్సు (3)
13. పస్తు, పరమౌషధం (3)
16. అటునుంచి అగ్ని ద్రవం (2)
17. అటునుంచే గోవు (2)
19. బాణం (2)
20. కాల్చి చూర్ణం చెయ్యడం (2)
21. దగ్గర, సమీపం (2)
22. పోకకు వ్యతిరేకం రావడం (2)
23. ప్రభాత సమయం (3)
25. యుద్ధం, పోరు (3)
26. ఎల్లప్పుడు (2)
27. తడబడిన కలుజు (3)
29. మితము లేనిది (3)
30. తెలుగు గేమ్ (2)

**నిలువు**

1. ఉదక మండల కొండ (4)
2. నీటబుట్టిన కమలం (3)
3. పంట – పైరులలో పచ్చదనం (6)
5. క్రింద నుంచి సౌధము (3)
8. ఒట్టు, ప్రతిన (3)
9. తమిళంలో శ్రీ (2)
10. కాసారం, తెలుగు ట్యాంకు (3)
12. కోలలతో ఆడే నృత్యం (3)
14. నందనకు ముందు గల తెలుగు సంవత్సరం (2)
15. తల (2)
16. బలుపు కాదు... (2)
18. తెలుగు ఇన్‌కం (3)
19. బండి (3)
22. రాజులకు రాజు (3)
24. ఏకాదశికి ముందు తిథి (3)
25. తడబడిన కపోతం (3)
26. బేసి సంఖ్య కాదు... (2)
28. మృగయా వినోదం (2)

**సమాధానాలు**

## పదరంగం -65

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ప | 2 టా | 3 లం | ■ | 4 ప | టా | 5 రం | ■ | 6 కో | 7 మా |
| 8 టు | కీ | గా | ■ | శు | ■ | 9 కు | 10 మ | రి | త |
| త్వం | ■ | ■ | 11 గో | వు | ■ | ■ | 12 లా | క | రు |
| ■ | 13 త | 14 లు | పు | ■ | 15 వా | 16 ర | ము | ■ | ■ |
| 17 వె | ట | కా | రం | ■ | 18 ణి | క్ష | ■ | 19 న | 20 ది |
| 21 ల్లు | ము | ■ | ■ | 22 క | రు | ణ | ■ | 23 ల | న |
| వ | ■ | 24 తో | ము | ల | వా | ■ | 25 ను | కూ | క |
| ■ | ■ | య | ■ | 26 త | హి | 27 మ | ■ | 28 బ | రు |
| 29 ఆ | 30 మో | ద | ము | ■ | 31 ని | శా | 32 చ | రు | డు |
| 33 శ | త | ము | ■ | 34 క్రి | ■ | 35 నం | దు | డు | ■ |

# కవిత్వమూ, దార్శనికతా ప్రతిరూపం రామకృష్ణ కవిత్వం!

"we all sweated under the load of our Novels the dead man was also sweating with sadness and a book, a book behind, a book above abrupt bud of the corpse"

- Cebar Vallejo

కవిత్వం పట్ల ఆసక్తి, అనురక్తి, సంవీల్యత, ఆస్వాదన, అభివ్యక్తి వున్న పెరుగు రామకృష్ణ కవిత్వాన్ని మనమెంత జాగ్రత్తగా చదవాలో, పాఠకులు మేధావిత్వానికి కవి ఎంత ఒద్దికగా, జాగ్రత్తగా మసలుకోవాలో 'పూలమ్మిన ఊరు' కవితా సంపుటి చదివిన తర్వాత నాకనిపించింది. వస్తుపరంగా కవులు ఉన్నతులవుతున్నకొద్దీ సాహిత్య ఆస్వాదనా పరంగా చకోరపక్షులై పోయారు ఆధునిక పాఠకులు.

'పూలమ్మిన వూరు' కవిత చదువుతున్నపుడు

*"సారె చక్రం మీద*
*మట్టి వీణెలు మ్రోగించిన చేతులు*
*ఇప్పుడు, మట్టి టకారాలు మోస్తున్నాయి*
*పగిలిన కుండ పెంకులు ఏరుకుంటున్నాయి"*

అన్న వాక్యాలు గుండెల్లో కుమ్మరిపై సానుభూతిని కలిగిస్తాయి. అయితే అభివ్యక్తి మరింత ధృడంగా వుంటే బాగుండేదేమో అనిపించింది. 'మట్టి వీణెలు మ్రోయించిన చేతులు' గాక సృజనకారుడైన వాడి చేతులు అని వుంటే భావం అభివ్యక్తి మరింత పదునుగా వుండేది.

*"కవిత్వమంటే*
*ఒక ఆనందపు తెర*
*ఒక దుఃఖపు పొర*
*ఒక మహాద్భుత వైచిత్రి"* అని ఖలీల్ జీబ్రాన్ అంటే
*"కవిత్వం*
*ఓ తాత్వికత*
*ఓ సాంద్రత*
*ఓ మమేకం"* అంటున్నాడు పెరుగు రామకృష్ణ. ఇద్దరూ కరెక్టే!

'మనిషే అక్షరం'లో నా బలమే ఒక అంతర స్పర్శ అని పెరుగు రామకృష్ణ అంటున్నాడు గానీ 'ఒక అంతస్పర్శే అతని బలం' అని నేననుకుంటున్నాను. యాభై సంవత్సరాల నా సాహిత్య జీవన గమన మార్గంలో కవిత్వమంటే సామాన్యుడికి దగ్గర కావడమనే స్థిరమైన నిర్ణయానికి వచ్చేశాను నేను. అందువల్లే అస్పష్ట, సంక్లిష్ట కవిత్వాలను ఆది నుంచి కూడా నిరసించాను.

శివారెడ్డి సంక్లిష్టత నుంచి బయటపడటం తెలుసుగానీ, సాంద్రత్వం నుంచి 'మో' బయట పడ్డాడో లేదో నాకిప్పటికీ అపనమ్మకమే.

ఈ నేపథ్యంలో ప్రజల భాషలో ప్రజల కోసం రాసిన గద్దర్ లాంటి వ్యక్తులు బాగా పాపులర్ అయ్యారని నేను భావిస్తున్న తరుణంలో పెరుగు రామకృష్ణ

*"గురి కోసం నేను*
*పాటను ఆయుధం చేస్తాను*
*దానికి జనగణమణగా*
*నామకరణం చేస్తాననడం"* బాగుంది.

**పుస్తక సమీక్ష**

**పూలమ్మిన ఊరు**
(కవితా సంపుటి)
సృజనకారుడు : **పెరుగు రామకృష్ణ**
విమర్శకుడు : **పాయసం సుబ్రహ్మణ్యమహర్షి**
వెల : **100/-** పేజీలు : **108**
**ప్రతులకు :** కవి, 25–1–949, నేతాజీనగర్, 5వ వీధి, ఏ.కె.నగర్, నెల్లూరు–4.

పెరుగు రామకృష్ణ పాట బాటలో పయనించగలిగితే సామాన్య ప్రజల నాడి ఏమిటో స్పష్టంగా తెలుస్తుంది. ఆ ప్రయత్నం చేయాలన్నది నా ఆకాంక్ష. కవితా సంపుటిలో సముద్రపు భావనలు అధికంగానే వున్నాయి. అందుక్కారణం ఇంతకు క్రితం పొయిట్రీ 'ఫ్లెమింగో' అయి వుండవచ్చు. నెల్లూరు సముద్ర తీరస్థ ప్రాంతం కావడం, గూడ కొంగల పరిశీలన కోసం సముద్రాన్ని అనేకమార్లు సందర్శించడం కవిపై బాగా ప్రభావాన్ని చూపించి వుండవచ్చు.

కవి భావనల్లో వాస్తవిక ప్రపంచం, ఆ మనుషుల నిర్లక్ష్య ధోరణి, మరణానికి చేరువగా కాలుష్యం భూతమై పొంచి వుండటం, పర్యావరణం సర్వనాశనమైన భూమ్మీద 'మృత్యు ఘంటికలు' మ్రోగించడం నాకు బాగా నచ్చిన అంశం. కవిత్వం ఊహాలోక విహారం ఎన్నటికీ కారాదు. వాస్తవం ఎంత చేదైనదైనా ఖరాఖండితంగా చెప్పగలిగిన వాడే కవి. ఆ కవిత్వానికే విలువ.

వృత్తులు, ఆయా పనుల దీన స్థితులు కని దృష్టి నుంచి తప్పించుకోలేక పోయాయి. (అచ్చులు, జాలరి) బాల్యంలో తండ్రి మరణం వల్ల తర్వాతికాలంలో ఆ జ్ఞాపకం స్పష్టాస్పష్ట మసకలో అలాంటి ఆకృతి ప్రతిబింబిస్తూ వుంటుంది. కవి అంటాడు కదా? నాన్న ముఖ చిత్రం పొగ చూరుకున్న ఆకాశం. తద్దినానికే పరిమితమైన అసంపూర్ణ జ్ఞాపకం. ఇది పదునైన భావవ్యక్తీకరణ.

కవి నిరంకుశుడే కావచ్చు. కవి క్రాంతి దర్శే కావచ్చు. అయితే కవి పాఠక జన హృదయాంతర్గత దార్శనికత్వానికి అలవాటు పడాలి. చారిత్రక సత్యాన్ని చెబుతున్నపుడు మానసిక సమతుల్యతను పాటించి తీరాలి కవి! ఇలా ఎందుకంటున్నానంటే–

*"తాజ్‌మహల్*
*బ్రతికి ఉందనుకొంటున్న*
*వాళ్లకి చెప్పండి*
*అక్కడ ప్రేమ మరణించి*
*శతాబ్దాలయిందని"* అంటాడు కవి. మరణమొక విషాదం కాదు' కవితలో. ఆ అద్భుత కళాఖండం బింబ ప్రతిబింబాలు, అందాలు, అరవిందం లాంటి వర్చస్సు, గాలి తాకిడికి అక్కడ లయధ్వనుల మధుర మంజులత, ఆ చిరుగాలి హొయలు, లయలు, శ్రుతులు, జతులు, నుతులు, సన్నుతులు పరమాద్భుతమైన స్పర్శ, మధుర మనోజ్ఞ దృశ్య, సాదృశ్య చిత్రికలు ముంతాజ్ మహల్ పట్ల ఆ మొఘల్ పాదుషా ప్రేమామృత స్మృతుల్ని మోహరింపజేయడం లేదా? అక్కడ మరణించింది శరీరాలే తప్ప ప్రేమ ఎలా అవుతుంది.

ఏదిఏమైనా పెరుగు రామకృష్ణ కవిత్వంలో సామాజిక స్పృహ వుంది. సమాజ దార్శనికత్వం వుంది. భావుకత వుంది. కేంద్రీకృత నిమగ్నత వుంది. ఇన్ని సలక్షణతల ముందు కొన్ని పొరబాట్లు సహజమే. ముందు ముందు మరింత కవిత్వాన్ని రాయాలని భావ సాంద్రతను తగ్గించుకోవాలనీ, మృద్ఘటం వంటి పదకాఠిన్యాల్ని వదలించుకోవాలనీ కోరుతున్నాను.

## రైతు లోకం

# వర్మి కంపోస్టు తయారీ!

**పాక/బెడ్ తయారీ:** పాక సుమారుగా 300 చదరపు అడుగులు (20x15) వైశాల్యములో నిర్మిస్తే 15x3x1 1/2 అడుగుల బెడ్‌లు మూడు పెట్టుటకు వీలౌతుంది. ఈ బెడ్‌ల అడుగు భాగం గట్టిగా వుండేందుకు 15 సెంటీమీటర్ల మందంలో రాళ్లు, కంకర, ఇటుకముక్కలు వేసి బాగా దిమ్మిశ కొట్టాలి. ఈ విధంగా ఏర్పరచుకున్న బెడ్‌లపై సుమారు 45 సెంటీమీటర్ల మందం వరకు పాక్షికంగా కుళ్ళిన వ్యర్థ పదార్థాలు పరవాలి. దీనిపై 5–10 సెంటీమీటర్ల మందం వరకు పేడను వేసి బెడ్ మొత్తం నీటితో తడపాలి. ఎల్లప్పుడూ 50–60 శాతం తేముండేలా జాగ్రత్తపడాలి. ఈ విధంగా వారం వరకు తేమ సరిపోయేలా నీటిని చల్లుతూ వారం తర్వాత బెడ్‌పై బొరియలు చేయని వానపాములను ప్రతి చదరపు మీటరుకు వెయ్యి వరకు వదలాలి. ఈ వానపాములు ఆహారాన్ని, తేమను వెతుక్కుంటూ లోపలకు వెళతాయి. ప్రతిరోజూ తమ బరువుకు తగ్గ ఆహారాన్ని తీసుకుంటాయి. బెడ్‌పైన తడిసిన పాత గోనె సంచులను పర్చిన తేమను కాపాడటమే గాక వానపాములను పక్షులు, చీమల నుండి కాపాడవచ్చు. కోళ్ల బెడద లేకుండా జాగ్రత్తపడాలి.

డాక్టర్ కె.పుల్లంరాజు
కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.

**కాలవ్యవధి:** సాధారణంగా 2–3 నెలల్లో వర్మి కంపోస్టు తయారవుతుంది.

**తయారయిన కంపోస్టు తీసే పద్ధతి:** బెడ్ నుండి వర్మి కంపోస్టు తీయడానికి 4,5 రోజుల ముందు నుండి నీరు చల్లడం ఆపివేయాలి. ఈ విధంగా చేయడం వల్ల వానపాములు తేమను వెతుక్కుంటూ లోపలికి వెళ్లి అడుగుభాగంలో చేరతాయి. బెడ్‌పైన వున్న గోనె సంచులను తీసివేసి, ఎరువును చిన్నచిన్న కుప్పలుగా చేసుకొని 2–3 సెంటీమీటర్లు. జల్లెడలో జల్లించి సంచులలో నింపి నీడగల ప్రదేశంలో నిల్వ చేసుకోవాలి.

**వాడు పద్ధతి:** ఒక ఎకరానికి ఒక టన్ను వర్మి కంపోస్టు ఎరువు వేయాలి. వర్మి కంపోస్టు అన్ని రకాల పంటలకు వేసుకోవచ్చు.

Regn.No. : RN 1156 / 57

J/Nellore/008/12-14

జమీన్‌రైతు

## బాలారిష్టాలతో...

# ఉక్కిరిబిక్కిరౌతున్న జగన్ పార్టీ!

**పార్టీలో తలెత్తే సమస్యలు పరిష్కరించే వారు లేకపోవడంతో కొండా సురేఖ దంపతులు, కొణతాల రామకృష్ణ, భూమా నాగిరెడ్డి, భూమన కరుణాకరరెడ్డి, మేకపాటి రాజమోహన్‌రెడ్డిలాంటి నేతలంతా తీవ్ర నిరాశా నిస్పృహలకు లోనవుతున్నారు.**



పురిటిలోనే సంధి కొట్టినట్లుందనడం పెద్ద మాట కావచ్చు. కానీ వైఎస్ జగన్ పార్టీని బాలారిష్టాలు ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి. అదేమీ ప్రజలలో నుంచి పుట్టుకొని వచ్చిన పార్టీ కాదు. సిద్ధాంతాలు, చట్టుబండలు అసలే లేవు. ఉద్యమాలలో ఊపిరి పోసుకొన్నదీ కాదు. ఒకే ఒక్కడి అధికార దాహం కోసం, ఒకే ఒక్కడి వ్యక్తిగత అవసరం కోసం పుట్టిన పార్టీ అది. దానివల్ల ఆ ఒక్కడు లేకుంటే నడవడం కష్టంగా మారుతున్నది. తాను ప్రాణం పోసిన బొమ్మ నడక నేర్చుకోవలసిన సమయంలో తాను జైలు పాలు కావడం జగన్ దురదృష్టం. ఏ చిన్న సమస్య వచ్చినా జగన్ వైపు చూడడం మాత్రమే ఈ పార్టీలోని వారికి తెలిసిన విద్య. ఆయన లేకపోవడంతో ఎవరికివారై పోతున్నారు. తన కోసం పెట్టుకొన్న పార్టీ కాబట్టి తాను లేనప్పుడు కూడా తన స్వంత కుటుంబ సభ్యులు మాత్రమే పార్టీ బాగోగులు చూడాలన్నది జగన్ ఆంతర్యం. అందువల్లనే ఆ పార్టీలో కొద్దోగొప్పో రాజకీయ అనుభవం వున్న వారు ఉన్నప్పటికీ వారందరినీ పక్కన పెట్టి తన పిన తండ్రి వైవి సుబ్బారెడ్డికి పగ్గాలు అప్పజెప్పాడు. పాపం సుబ్బారెడ్డి రాజకీయ డక్కామొక్కీలు తిన్న వాడు కాదు. దానితో పార్టీలో తలెత్తే సమస్యలు పరిష్కరించలేక సతమతమై పోతున్నాడు. సలహా చెప్పే జగన్‌ను కలవడం వారానికొకసారి తప్ప వీలు కావడం లేదు. ఈ లోపంతో పార్టీలో అసమ్మతులు, లుకలుకలు, అలుకలు అధికమై పోతున్నాయి. వరంగల్‌లో కొండా సురేఖ దంపతులు బిజెపి వైపు మొగ్గుచూపుతున్నారు. జగన్ పార్టీకి మంత్రసాని పనిచేసిన నేత సురేఖ. జగన్ కోసం మంత్రిత్వాన్ని చీపురు పుల్ల కంటే హీనంగా తీసి పక్కన పడేసిన త్యాగి. సహజంగానే పార్టీలో మరీ ముఖ్యంగా తన జిల్లాలో తన మాట నెగ్గాలని కోరుకోవడం తప్పులేదు. అయితే అది జరగడం లేదు. దానితో వేరే దారి చూసుకోవడం మేలన్న నిర్ణయానికి వచ్చారామె. బిజెపి మీద మోజు పెంచుకొంటున్నారు.

అనకాపల్లి నేత కొణతాల రామకృష్ణ సురేఖతో సరిపోల్చగల్గిన త్యాగి. వైఎస్ మీద అపారమైన భక్తితో కాంగ్రెస్‌ను వదలి వచ్చేశాడు. పదవులు, అధికారం అన్న ఆలోచన లేకుండా జగన్ కోసం సర్వం వదడానికి సిద్ధపడ్డాడు. అయితే గత ముప్పై ఏళ్లుగా ఆయనకు స్థానిక రాజకీయ ప్రత్యర్థి దాడి వీరభద్రరావును తెచ్చి నెత్తిన పెట్టుకొన్నాడు జగన్. తెలుగుదేశంలో చంద్రబాబుతో సమానంగా ప్రతిపక్ష నాయకుడి హోదాలో వున్న వ్యక్తిని తన వైపుకు లాగితే, చంద్రబాబు నైతికంగా దెబ్బ తింటాడన్న ఆశతో దాడికి స్వాగతం పలికాడు జగన్. కానీ అది కొణతాలకు అరికాలి మంట నషాళానికి ఎక్కినట్లైంది. దాడి తాను ఒక వరలో ఇమడని కత్తులమన్న భావనతో కొణతాల పక్క చూపులు చూస్తున్నాడు. ఆయన్ను అక్కున చేర్చుకొని జగన్ పార్టీకి పురిటిలోనే సంధి కొట్టిందన్న ప్రచారం చేయవచ్చుననే అంచనాతో మంత్రి గంటా శ్రీనివాసరావు పాచికలు విసురుతున్నాడు.

నెల్లూరు జిల్లాలో మేకపాటి రాజమోహన్‌రెడ్డి కూడా జగన్ కోసం సర్వసంగ పరిత్యాగం చేయడానికి సిద్ధపడిన నేత. ఎమ్పీ పదవికి రాజీనామా చేసి ఉప ఎన్నికలు ఎదుర్కొన్నవాడు. తన వ్యాపారాలను కూడా పణంగా పెట్టాడు. అంత చేసిన తర్వాత తన పెద్దరికానికి విలువ కావాలని కోరుకోవడంలో తప్పు లేదు. కానీ నెల్లూరు జిల్లాలో ఆయన మాట వినిపించుకొనే వారు లేరు. నెల్లూరు రూరల్, నెల్లూరు టౌన్, వెంకటగిరి, సూళ్లూరుపేట, కావలి, గూడూరు నియోజకవర్గాలకు తన అనుచరుల పేర్లు ప్రతిపాదించాడు రాజమోహన్‌రెడ్డి. కానీ ఏ ఒక్కదానికీ పార్టీ అనుమతి రాలేదు. తన మాటకు విలువలేని పార్టీ మీద తనకెందుకు అనురక్తి అన్న నిర్వేదంలో పడిపోయాడు మేకపాటి రాజమోహన్‌రెడ్డి. ఆయనకు నచ్చ చెప్పే వారు పార్టీలో ఎవరూ లేకుండా పోయారు.

కర్నూలు జిల్లాలో భూమా నాగిరెడ్డి దంపతులు, తిరుపతిలో భూమన కరుణాకరరెడ్డి కూడా ఇటువంటి నిరాశా నిస్పృహలతో మధన పడుతున్నారు. రెండవ తరగతికి చెందిన నాయకులైతే ప్రతి జిల్లాలో కోకొల్లలుగా వున్నారు. వీరందరూ మెల్ల మెల్లగా పార్టీ వ్యవహారాలకు దూరమై పోతున్నారు. బలవంతంగా పని చెప్పినా అన్యమనస్కంగా వ్యవహరిస్తున్నారు. మరొక ప్రక్క నియోజకవర్గ కో ఆర్డినేటర్ల నియామకం పార్టీకి పెద్ద తలనొప్పిగా మారింది. ఉత్తరప్రదేశ్‌లో అఖిలేష్ యాదవ్ ఈ ప్రయోగం చేశాడట. ఏడాది ముందే ఎమ్మెల్యే టిక్కెట్ ఆశావహులకు టిక్కెట్ సంకేతాలిచ్చి ప్రజలలో పని చేసుకోమని చెప్పాడట. ఆ ప్రయోగం సఫలీకృతం కావడంతో జగన్ కూడా చాలా ముందుగా ఎమ్మెల్యే టిక్కెట్ కోరుకొంటున్న వారిని ఇన్‌ఛార్జ్ పదవులతో సత్కరించారు. కానీ ఆ అవకాశం దక్కని వారు ఇన్‌ఛార్జిల గుండెల్లో కుంపటిగా మారి పోయారు. తెలుగుదేశంతోనో, కాంగ్రెస్‌తోనో పోరాడడం మాని తమలో తాము తన్నుకు చస్తున్నారు. ఇది పార్టీకి పెద్ద తలనొప్పిగా మారింది.

ఈ సమస్యల పరిష్కారం విషయంలో వైవి సుబ్బారెడ్డి విఫలం కావడం పార్టీకి ముందు ముందు చాలా అనర్థదాయకమౌతుందన్న భయంతో వైవి సుబ్బారెడ్డిని పక్కకు తప్పించక తప్పలేదు జగన్‌కు. వైవి స్థానంలో ఒంగోలు జిల్లాకు చెందిన బాలినేని వాసును పార్టీ పెద్దగా నిర్ణయించాడు. వాసు కూడా జగన్ కుటుంబ సభ్యుడే. అయితే వైవి కంటే కొంచం అధికంగా రాజకీయ అనుభవం వుంది. ఇంతకాలం ఒక్క ఒంగోలు జిల్లా వ్యవహారాలు మాత్రం చూసుకొంటూ వుండేవాడు. ఇప్పుడు హైదరాబాద్‌కు మకాం మార్చాడు. వచ్చీ రావడంతోనే మొదటి లక్ష్యంగా కొండా సురేఖతో మంతనాలు మొదలు పెట్టాడు. ఆమెలోని అసమ్మతిని కొంతవరకు తగ్గించినట్లు చెప్తున్నారు. అంటే తొలి ప్రయత్నంలోనే విజయం సాధించాడన్న మాట. ఇప్పుడు మేకపాటి, కొణతాలను బుజ్జగించే పనిలో నిమగ్నమై వున్నాడు.

అయితే ఈ పరిణామం పార్టీలోని కొందరికి నచ్చడం లేదు. ఇంతకాలం వైవిని నమ్ముకొంటే పార్టీలో తమకు పెత్తనం లభిస్తుందన్న ఆశతో ఆయనకు శుశ్రూషలు చేస్తున్న వారిలో భయం మొదలైంది. తాము నమ్ముకొన్న పెద్ద మనిషే చిన్న మనిషిగా మారిపోతే తమకెవరు దిక్కని వాపోతున్నారు వారు.



**ఆల్ ఇండియా రేడియో డైరక్టర్ జనరల్‌గా రిటైర్ అయిన సాహితీవేత్త, తిరుమల వెంకన్నకు చెందిన ఎస్వీబిసి టెలివిజన్ ఛానల్‌కు జీవం పోసిన ధార్మికుడు డాక్టర్ రేవూరు అనంత పద్మనాభరావు గారికి విశాఖపట్నంలోని సనాతన ధర్మ ట్రస్ట్ శ్రీరామనవమి సత్కారం అందజేసింది. హైకోర్టు జడ్జి చంద్రకుమార్ చేతులమీదుగా ఆ సత్కారం అందుకొంటున్న దృశ్యం ఇది.**

# నెల్లూరు అయ్యవారికి మద్రాసు సత్కారం

మద్రాసు ఐఐటిలో కెమిస్ట్రీ విభాగాధిపతిగా ఉన్న నెల్లూరీయుడు ప్రొఫెసర్ కె.క్రిష్ణయ్యకు ఒక అరుదైన గౌరవం దక్కింది. మీకు చదువు చెప్పే వారిలో ఉత్తమ అయ్యవారు ఎవరు అని విద్యార్థులలో ఓటింగ్ పెడితే క్రిష్ణయ్య గారిని వరించారట విద్యార్థులు. ప్రభుత్వం ఇచ్చే ఉత్తమ అధ్యాపక అవార్డుల వంటిది కాదిది. విద్యార్థుల మనసు గెలుచుకొన్న విశిష్ట వ్యక్తిత్వానికి అభినందన వంటిది.

క్రిష్ణయ్య గారు విలక్షణ వ్యక్తి. తన చదువేదో తానేదో తప్ప మరొక ప్రపంచాన్ని పట్టించుకోరు. తాను సాధించిన ఘనతను పక్కవాడికి కూడా చెప్పుకోడు. ఆల్ ఇండియా స్థాయిలో ఐఐటి ప్రవేశ పరీక్షల నిర్వహణ బాధ్యతను చాలాకాలం నెరవేర్చారాయన. హైదరాబాదులో కొత్తగా స్థాపించిన ఐఐటి శాఖకు ప్రణాళిక రచించింది కూడా ఆయనే. ఇవన్నీ ఎవరికీ తెలియదు. ఆయన చెప్పడు. ఇప్పుడు ఈ అవార్డు విషయం కూడా అంతే. హిందూ విలేఖరి ఒకరు ఆలస్యంగా వార్త తెలిసి ప్రచురించడంతో అందరికీ తెలిసింది.

క్రిష్ణయ్య గారు నెల్లూరు వాసి. రిటైర్డ్ డిఎఫ్ఓ మల్లిఖార్జున రావు సోదరుడు. మరొక రిటైర్డ్ డిఎఫ్ఓ ప్రభాకర్ రావు బావ. ఒక నెల్లూరు వాడిగా మద్రాసు విద్యార్థుల మనసు గెలుచుకొన్న క్రిష్ణయ్య గారిని మనసారా అభినందిస్తున్నాము





Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com